హరిహర హిరణ్య గర్భేభ్యోనమః

# పండుగలు - పరమార్థములు

## (పల్లెటూరి పాటలతోబాటు)

గ్రంథసంధాత


నేదునూరి గంగాధరం


"ఆశ్రిత కల్పద్రుమ"

బిరుదాంకితులును, మ్యునిసిపల్ కౌన్సిలరును, వామనచరిత్ర;
మహాభారత తత్వకథనమున "దుష్టచతుష్టయచర్య",
సింహాద్రిప్పన్న, బాలాతంత్రము, జాతక నారాయ
ణీయాది గ్రంథరాజములకు ద్రవ్యసహాయులైన

**శ్రీ జిల్లా సుబ్బారావు శ్రేష్ఠిగారి**

ద్రవ్య సహాయమున ముద్రింపించఁబడినది.


రాజమండ్రి.

కాపీరైటు 1956 వెల 0—12—0

# కృతజ్ఞత

మహారాజశ్రీ ఆలిండియా రేడియో హైదరాబాదు స్టేషన్ డైరక్టరుగారు "పల్లెటూరి పండుగలు" గురించియును—మహారాజశ్రీ మద్రాసు రేడియో స్టేషన్ డైరక్టరుగారు "జానపద గేయములు" గురించియును—నాకు రేడియో ప్రోగ్రాము లిప్పించవలెనని మహారాజశ్రీ విజయవాడ రేడియో స్టేషన్ డైరక్టరుగారికి శిఫారస్సు చేసినారు. వారి శిఫార్సుల ననుసరించి జరిగించుటయేగాక; వీరును మరికొన్ని ప్రోగ్రాములు తమ స్టేషన్‌లో నా కిచ్చినారు.

సదరు వ్యాసములను అచ్చువేయించుకొనుటకు, పరిమిషను కోరగనే దయతో; అంగీకార ఉత్తరమును పంపించినారు.

ఇందులోగల సంప్రదాయక విజ్ఞానములు, జానపద గేయములు, తెలుగునేల నాలుగుచెరగులందును, చాలమంది చెప్పినారు. వారిద్వారా సేకరించుకొన్నాడను.

ఈపుస్తక నిర్మాణమునకు శ్రీ బెజవాడ వెంకటేశ్వరరావు, బి.ఏ. గారు చక్కని సలహాల నిచ్చి సహాయపడినారు.

కావున యిందుమూలముగా పై వారలందరకు నా కృతజ్ఞతాపూర్వక వందన మందించుచున్నాడను.

# అన్నా చెల్లెలు సంవాదన

అన్న:–బాలసుబ్రహ్మణ్యము
చెల్లెలు:–విజయ వెంకట సత్యవతి

చెల్లెలు:– పండుగలు; నోములు; వ్రతంబులు
ప్రతీయేటను చేయుచుందురు
పరమ సూత్ర మేమిటో?
తెలియఁజెప్పుము అన్నయా!

అన్న:– దేశ సంస్కృతి: దీప్తిఁజెందఁగ
దేశ కళలవి । తేజరిల్లఁగ
దేశ మందలి; ధీవిశాలుర;
స్మరణ చిహ్నముల్, చెల్లెలా!

చెల్లెలు:– దేశ సంస్కృతి; దీప్తియేది?
దేశ కళలకు, తేజమేది?
దేశమందలి । ధీవిశాలుర;
స్మరణలేమిటి? అన్నయా!

అన్న:– రామరాజ్యము । ప్రజాసౌఖ్యము;
సకల వృత్తుల । చాకచక్యము
పుణ్యపురుషుల । బోధ వర్తన
లుండునమ్మా । చెల్లెలా!



శ్రీ బ్రాహ్మబ్జ్ఞానభూతేశోభ్యోనమః

# పండుగలు పరమార్థములు

## (పల్లెటూరి పాటలతోపాటు)

ప్రథమ భాగము.

## పండుగల ప్రాధాన్యము.

ప్రాచీనకాలమునందలి, రీతిని, నీతిని, తెలిసికొనవలె నన్నచో; పండుగలే ఆధారములు.

పండుగులవలననే భారతదేశము ఆధ్యాత్మికముగను, అది భౌతికముగను, వృద్ధిపొందుచున్నదనుటలో సందేహము లేదు.

పూర్వమునుండియు నేటివరకును, మనము క్రియా రూపమున దేశచారిత్రమును, దేశగౌరవమును, ధ్యానించు చున్నాము. మహామహుల చారిత్రములను, తలంచుకొనుచు, వారిని పూజించుచున్నాము. ఇవియేకదా? పండుగదినములు! వీనిని పబ్బములనియును; పర్వములనియును; వచింతురు. పండుగలే సజీవములైన చారిత్రకగ్రంథములు, ఒక దేశము యొక్క ఔన్నత్యమును చెప్పవలెనన్నచో, చరిత్రగ్రంథ ములే యాధారములు. ఒక జాతియొక్క విజ్ఞానమును;

నాగరికతను; మతమును; ఆచారములను; సభ్యతను; తెలిసి కొనవలెనన్నచో; ఈ పర్వదినములే పుస్తకరూపముగా నుండి తెలుపుచున్నవి—మన పురాణములలో మనకు దొరుకని విషయమే యుండదు. పురాణములలో, ప్రతివిషయములోను సాహిత్యము; మతము; రాజకీయములును, ఆరోగ్య; ఖగోళ; భూగోళాది శాస్త్రములును, చరిత్ర; వేదాంతము మొదలగు విషయము లిమిడియుండును.

మన పూర్వులు బాగుగా నాలోచించి, దేశీయ జాతీయ; విజ్ఞానములను, చిరస్థాయిగా నుండుటకై, ప్రతి సంవత్సరము నొక్కసారి జ్ఞాపకముండున ట్లేర్పాటుచేసినారు. ఆయేర్పాట్లే పండుగలు.

జన్మజన్మములకు మరువకుండునట్లుగా, సూర్యచంద్ర గతులను బట్టి, నక్షత్ర ప్రమాణమునుబట్టి, ఋతువులనుబట్టి, వారములనుబట్టియును, ఋతువులు, కాలములు, వారములు, వర్జ్యములు, మొదలగు తీరులు యేర్పరచి, అనాగరకులను కూడ, నాగరకులుగ జేసిరి.

సంవత్సరములో ఒక్కసారియైనను, భూమిని గురించి యును, ఆరోగ్యమును గురించియును, కాలమును గురించి యును, మానవజాతిని గురించియును, సభ్యతగురించియును, తలచుకొనునట్లు మంత్రముల నేర్పాటుజేసిరి. గ్రంథములు పోవచ్చును. మతములు మారవచ్చును. భాష మారవచ్చును. ప్రళయము రావచ్చును. కాని, ప్రకృతిలో వ్రాసి పెట్టిన

జీవనసాహిత్యము మాత్రము ప్రకాశించుచునే యుండును. ఈ జీవసారస్వతమే మన పర్వదినములు; ఆచారములు.

చైత్రమాసము మొదలు, ఫాల్గుణమాసము వరకును, ఒక్క సంవత్సరమును, జ్ఞాపకము చేసుకొనుచున్నాము. ప్రభవ లగాయితు. అక్షయ వరకు నొక్కశకమును లెక్కించుచున్నాము. ఆకసమునందలి గ్రహములు, తోలకరలు, సేద్యానుకూల కాలములు, కోతలు, కుప్పనూర్పులు, మొదలగు శాస్త్రములను, గ్రంథములు చదువకయే తెలిసికొనుచున్నాము.

ఈ ప్రత్యక్షమగు రూఢిశిక్షలభించుచున్నపుడు, వ్రాత గ్రంథములు, భాండాగారములు, అక్కఱనే లేదుకదా? ఈ విజ్ఞాన సాహిత్యమే పండుగులలో లభించుచున్నది.

చైత్రమాసము రాగానే, "సంవత్సరాది" సంవత్సర పరిస్థితులు, "శ్రీరామనవమి" రామరాజ్యము; యిట్లే ప్రతిమాసము లందలి పండుగలు; వ్రతములు; పర్వదినములందలి విజ్ఞానసాహిత్యమును, వెలయించుచున్నది. ఒక సంవత్సరములో నివి యన్నియును సుమారు యెనుబది కలవు.

దేశకళ్యాణమునకే, చేయఁబడు నీ పండుగలు, మన ప్రాచీనకాలములోని, నీతులను; రీతులను; దెల్పుచు పల్లెటూళ్ళలో చెక్కుచెదరకుండ నిలిచియున్నవి. ప్రాచీన భారతీయ గౌరవమును నిల్పుచున్న యీ పండుగలలో ఉత్సవములు జరుపుదురు. ఉత్సవము లనఁగా కథలయొక్క రూప

ములే. ఉత్సవములు లేనిదే మానవజీవితము సార్థకము కాజా లదు. నిండుతనముండదు.

భగవంతుని; ఆనందమయస్వరూప; వికాసము మానవ జీవితముపైన ప్రసరింపఁ జేయునదే యుత్సవము. అందువల్ల ననే, తత్సంబంధమయిన, యుత్సవములు మనకు నిజమైన యానందమును కల్గించుచున్నవి. మన దేశీయులు చేయునవి ధర్మోత్సవములు.

ఉదాహరణము:—శ్రీరాముని విజయము, శ్రీకృష్ణ జననము, బలిచక్రవర్తి ధర్మము, మొదలగునవి. వీనివలన ధీరత్వము; వీరత్వము; ఉదారత; క్షమ; ఆధ్యాత్మికత, మొద లగు గుణములు కలుగుచున్నవి.

ఈ పండుగలలో, ప్రఖ్యాతములయినవి (౧) సంవత్స రాది (౨) దసరా (3) దీపావళి (౪) సంక్రాంతి; అనునవి. వీని యాచారములు. పరమార్థములు, జానపద గేయసంయు తముగా తెలిసికొనుట మేలుగదా?

# ౧ సంవత్సరాది

సంవత్సరాదినే "ఉగాది" అని పిలుతురు. ఈదినమును సంవత్స ఫలిత సూచకదినమందురు.

సంవత్సరాది యనఁగా సంవత్సరమున మొతటిదినమని యర్థము. అరవదేశీయులు; సౌరమానమును, ఉత్తరదేశీ

ములు; బార్హస్పత్యమానమును, మనవారు చాంద్రమాన మును, ప్రమాణములుగా తీసికొనుచున్నారు.

ఆంధ్రదేశమున వాడుకగనున్న చాంద్రమాన సంవత్స రపు ప్రథమదినమగు "చైత్రశుద్ధ పాడ్యమి" "సంవత్సరాది" అని గ్రహించుచున్నారు.

ఈరోజున పాడ్యమిలో, కొద్దిగనో; గొప్పగనో; అశ్వనీ నక్షత్రము సంభవించును. ఈరోజున కధిపతియగు గ్రహమే, యీ సంవత్సరమునకు రాజు. ఇది వసంతఋతువు నకును; వేసవికాలమునకును; ప్రారంభమురోజు. కావున యీ దినమునుండి తొమ్మిది దినములు "వసంతనవరాత్రములు" "వసంత మాధవ పూజలు" "వసంతోత్సవములు" జరుపుదురు. సంవత్సరాదికి, వెనుకటిరోజు ఫాల్గుణ బహుళ అమావాస్య. దీనిని "కొత్త అమావాస్య" అని యందురు. ఈరోజున పిండివంటలతోను, జంతుబలులతోను, గ్రామదేవత లకు "నైవేద్యములు" పెట్టుదురు. ఈతెల్లవారుగట్ల, అనఁగా తెల్లవారితే "సంవత్సరాది" వచ్చుననఁగా, "దొంగయేరు వాక" సాగుదురు.

సంవత్సరాదితో, మాస, ఋతు. కాలములమార్పులు ప్రారంభములగును. చెట్లు ఆకులురాల్చి; చిగుర్చుటయును; "కోయిలలు" "కుహూ? కుహూ?" అను మధురగానములు చేయుటయును, "కొత్తకవింత; పాతరోకరోత" అను సామె తను, తలపించుచు, ప్రకృతి ఆనందదాయకముగా నలరారు

చుండును. ప్రజానీకము "సంవత్సరాదినాడు తమకెట్లునడచునో ? ఆ సంవత్సరమంతయు నట్లే గడచును" అని నమ్ముచుందురు.

## ఆచారములు

ఈ పండుగరోజున 1. వేపపువ్వు పచ్చడి 2. పంచాంగశ్రవణము 3. మిత్రదర్శనము 4. ఆర్యపూజనము 5. గోపూజ 6. ఏరువాక యీ యాచారములు జరుపుచుందురు.

## 1. వేపపువ్వు పచ్చడి

ఈపర్వదినమునందు, షడ్రుచులుతినుట యాచారము అదే వేపపువ్వు పచ్చడి. దీనిని; "నింబకుసుమభక్షణం" "ఉగాదిపులుసు" అను పేర్లతో వచింతురు. దీనికి; అర్యులు చెప్పిన సూత్రమేమనఁగా

శ్లో॥ అబ్దాదౌ నింబకుసుమం। శర్కరామ్లఘృతైర్యుతమ్।
భక్షితం పూర్వయామేతు। తద్వర్షం సౌఖ్యదాయ
కమ్॥"

అనఁగా:- సంవత్సరారంభమున, మొదటిఝామునందు, వేపపువ్వు పంచదార; చింతపండు; నెయ్యి; వీనితోపాటు భక్షించినచో, ఆ సంవత్సరమంతయు సౌఖ్యముగా నుండును. ఉప్పు; కారము; వీనితో షడ్రుచులయినవి. ఈ యుగాదిపచ్చడి భక్షించుటవలన త్రిదోషములు హరించును. శరీరతత్త్వము మారును. అద్దాన యారోగ్యము కల్గును.

## 2. పంచాంగ శ్రవణము

ఈ సంవత్సర పరిస్థితులు తెలిసికొనుట, వర్షములు, పంటలు; ధరవరలు; తెలిసికొనుట, వర్షములు, పంటలు; ధర వరలు; తెలిసికొనుట, తమపేరు బలములు చూపించుకొనుట, ఆదాయము; వ్యయము; గుర్తించుట, సున్నలనుబట్టి దేహారోగ్యమును, తెలిసికొనుట, మొదలగు విషయములు అవగాహన చేసికొందురు.

"శ్లో॥ తిథిర్వారశ్చ నక్షత్రంచ। యోగకరణమేవచ।
పంచాంగ మతి విఖ్యాతం। లోకానాం కర్మసాధనమ్"

అనగా:- తిథి; వార; నక్షత్ర; యోగ; కరణముల నెడి, యీ యయిదంగములతోఁగూడిన పంచాంగము ప్రజల కర్మ సాధనకు ప్రఖ్యాతినందినది.

"జ్యోతిశ్శాస్త్రం మహాపుణ్యమ్॥ అనుసూక్తి ప్రకారము పంచాంగశ్రవణము, సంవత్సరాది పర్వమునందు గావించుట మహాపుణ్యము.

## 3. మిత్రదర్శనము

ఈ పవిత్ర దివసంబున, స్నేహితులను, యొకరొకరి యోగక్షేమములు ముచ్చటించుకొని; దుటయే, ఆనందకారకమై, చీకుచింతలను తొల యుండును.

## 4. ఆర్యపూజనము

కుటుంబములోని, వయస్సులో పెద్దలను పూజించి, వారి ఆశీస్సులందుదురు. దానివలన, శ్రేయోదాయకము సిద్ధించును.

## 5. గోపూజ

గోవు పరమ పవిత్రమైనది. దానివలననే; మానవులు పాడిపంటలచేత; పోషింపఁబడుచున్నారు. కనుక దాని పాల భాగమునకును; పాదములకును; పసుపురాసి, కుంకుమబొట్లు పెట్టి పూజింతురు. ఇది పుణ్యప్రదమైన విషయము. ఈ పుణ్య దినమునందు దొడ్డిలోనున్న యన్ని పశువులకు "ఉప్పు" పెట్టుదురు.

## 6. ఏరువాక

ఏరువాక:- దుక్కి దున్నుటకు ప్రారంభము. ఇది రెండువిధములు (1) దొంగయేరువాక. అనఁగా:_ తెల్లవారితే అన సంవత్సరాదియును, ప్రస్తుతము క్రొత్తఅమావాస్య తెల్లవారుగట్ల యెవ్వరితోను చెప్పకుండా; రైతు శుచియై; నాగ పువ్వు; యెద్దులనుపూజించి, ఏరువాకసాగించును. (2) ముహూర్త చినచో; వాక. అనఁగ:- మంచి ముహూర్తమును చూపించు కారము; ఆ శుభసమయములో తొలిదుక్కి దున్నుటకు ప్రారం భక్షించుటవ నూనె వేసిన పులగము యెడ్లకుబెట్టి నాగలికి యెడ్లను మారును. అద్దా పు కుంకుమలు రాసి,పూలు; పత్రి; దండలు వేసి; ర్పించుచు, స్త్రీలుహారతి నిచ్చెదరు.

## ఏరువాక పూజాపదము (జానపదగేయము)

౧ ప॥ మంగళమమ్మా; మాపూజలు గైకొమ్మా;
మంగళమమ్మా; మా నాగలినీ కు॥ మం॥

(1) కష్టమనక భూమి దున్ని!
కరువుమాపి; కడుపునింపి;
సకలజీవరాశిని, నీ;
చాలున పోషింతువమ్మా ॥మం॥

(2) కర్షకులను; కరుణతోడ;
కాపాడుచు; నెల్లప్పుడు.
కామితార్థముల నొసంగు,
కల్పవల్లి వమ్మ నీకు ॥మం॥

**విశేషాంశములు**:- ఈ యేరువాకలు రెండును, చైత్రమాసములోనే జరుగును. ఇవిగాక; "ఏరువాకపున్నమ" అని శ్రావణశుద్ధ పౌర్ణమినాడు, యేరువాక పండుగకూడా. కొన్ని ప్రాంతములందు చేయుచుందురు.

ఆనాడు కుడుములు; ఉండ్రాళ్లు; కొబ్బరికాయలు; అరటిపళ్లు మొదలగు వానితో, వినాయకునకు "నైవేద్యము" పెట్టి రావిఆకు తోరములు గట్టిన నాగళ్ళను, భుజముల పెట్టుకొని, పసుపురాసి; కుంకుమబొట్లుపెట్టిన, కాడిని రా వెమెడలకు గట్టి, పొలమునకు తోలుకపోయి, ముచ్చిముః మూడుచాళ్ళు తోలుదురు.

తమ వ్యవసాయము, పొడవునను, నిర్విఘ్నముగా సాగుటకై, యీలాగున చేయుదురు గాన దీనికి "ఏరువాక" అని పేరువచ్చినది. ఏరువాక యనఁగా కృష్యారంభమని యర్థము.

## ఏరువాక జానపద గేయములు

ఈ యేరువాకను గురించి, గేయములెన్నియో; జనపదములందు వాడుకలో నున్నవి. వాటిని కొన్నింటి నిట మచ్చున కుదహరించుచున్నాను.

౧ ఏరువాక వచ్చింది । ఏరువాకమ్మా;
ఏళ్లునదులు పొంగి । వెంట నేవచ్చాయి;
నల్లామేఘాలలో । నాట్యమాడింది
ఇసుక నదిలో దూరి । బుసలుకొట్టింది
పాడుతూ; కోయిలా; । పరుగులెత్తింది.
ఆడుతూ; నెమలి । అలసిపోయింది.

అనఁ గ్రామాంతరము, గిత్తలబేరమునకు వెళ్ళిన బావ, "ఏరువాక" పువ్వు పండుగకు, యింటికి మరలివత్తునని చెప్పి వెళ్ళినాడు. పల్లె చినచో, కుచు, ఏరువాక పండుగ కొరకు; బావ రాక కొరకు, పశే కారము; యెదురుచూచుచు; తన లేతహృదయములో, అణచుకో భక్షించుటవలూచుకోలేక; యెంతో ఆరాటపడుచున్నది. పల్లెపడుచ మారును. అద్దాన్ని ఒంటరిగానున్న పుడు.

## పల్లెపడుచు ఆరాటము (సెట్టూరి పాట)

3. తొలకరి; ఒక మబ్బు
మబ్బులో, ఒక మెరు
పెరటిలో, ఒక జల్లు
వీధిలో, ఒక గాలి।
ఏకొమ్మ మీదనో?
ఏటితో ౖవలు పట్టి
ఏరువాకా నాటి॥ కేడదిదాటింది
ఎదురుచూచి; గుండె। చెదిరిపోయింది
పిట్టపిట్టా ముద్దు। పెట్టుకున్నాయి।
గోవులన్ని దొడ్లు। చేరుకొన్నాయి
ఏటి గాలికి చిలుక। లెగిరిపోయాయి
ఎందుకో; నా ఆశ। లెగిరిపోయాయి.
ఏటి ఒడ్డున నేను। పాటపాడే వేళ
నవ్వుతూ; మాబావ। పువ్వులేరే వేళ.
కొంటికోయిలపైన। కూతకూసే వేళ
లేత మనసులు బాగ। పూతపూసే వేళ
బావొచ్చి; నాతోటి। బాసలెన్నో; ఆడి
ముద్దిచ్చి; నాతోటి। మురిసిపోవాలి;
ఏరువాకమ్మ మా। కెదురుకావాలి;
తిలకించి మముజూచి। పలకరించకుండ
తలవంచి; మముజూచి। దీవించిపోవాలి.

పల్లెపడుచులు, ఏరువాకమ్మను, ఆరాధనచేయుచు, యీక్రిందివిధముగ పాడుదురు.

## ఏరువాక ఆరాధన (జానపద గేయము)

౧ ఏరువాకమ్మకూ? ఏమికావాలి ?
ఎట్ట ఎట్టని । పూలమాల కావాలి.
ఎరుపు, తెలుపుల । మబ్బుటెండ కావాలి.
ఏరువాకమ్మకూ ? ఏమికావాలి ?
పొలము గట్టున । నిలిచి వేడుకోవాలి;
టెంకాయ వడపప్పు । తెచ్చిపెట్టాలి;
ఏరువాకమ్మకూ ? ఏమికావాలి ?
ముత్తైదలందరూ । పాట పాడాలి;
పున్నిస్త్రీ లందరూ । పూజచేయాలి;
ఏరువాకమ్మకూ; ఏమికావాలి ?
పాటపాడుతు తల్లి ।పాదాలు మొక్కాలి?॥

అని భక్తిగా నీ జానపదగేయము పాడి; కోరికలు కోరుకొంటూరు.

౨ ఏరువాకమ్మను । ఏమికోరాలి;
ఎడతెగని సిరులివ్వ । వేడుకోవాలి;
పాడిపంటలు కోరి । పరవసించాలి.

ఈవిధముగ; ఏరువాకపండుగను చేసికొందురు.

## సంవత్సరాది సంబరము-పాట

ఈ రోజున బాలబాలికలు, ఆనందపరవశులై, యీ జానపదగేయమును పాడుచుందురు.

౬ ఉగాదిపండుగ వచ్చింది;
ఊరికి అందం తెచ్చింది.
దేవుడి గుడిలో బాజాలు.
బాజాలయ్యాక పూజాలు.
ఊరేగింపులు జరిగాక.
ఉత్సవాలు ముగిశాక.
పంచాంగాలను చదివించి.
మంచీ చెడ్డలు విన్నాము.

## దేశవాళీ ఆటలు-పాటలు

నూతనసంవత్సరమున, నూతనోత్తేజముతో, బాలురు ఉజ్జీలు వేసికొని; చెడుగుడి, ఉప్పట్లు, మొదలైన దేశవాళీ, ఆటలు ఆడుకొందురు.

చెడుగుడి నే; బల్ చిక్కు; అని పిలిచెదరు. ఈ యాటలో ఒకజట్టు కూస్తూఉంటే; ఒకజట్టు పట్టుకొంటూఉంటుంది. వీరోచితమైన ఈ యాటలో కూయు పాటలు.

౧ ఓరగడం; పగడం
కవిలికి దంతం;
గిరగిర చక్రం;

గుంజ ప్ప!
హా! హూ!
కళింగ పాపుడు
కడ్డీ; కడ్డీ; కడ్డీ;

౨ చెట్టు గొట్టగా
పాలు గారగా
చెన్నాపట్టం
ధారిచ్చి; దారిచ్చి; దారిచ్చి;

౩ ఆ లీ; బలీ;
చంగల్ నాడు;
కీత్; కీత్; కీత్;

ఇటువంటి జానపదగేయములతో. "దేశవాళీ" ఆటలు బాలురు ఆడినట్లే బాలికలునూ, ఆడుకొందురు.

౧ చెమ్మ; చెక్క;
చేరడేసి మొగ్గ;
అట్లుపోయంగ;
ఆరగించంగ;
ముత్యాల; చెమ్మచెక్క;
ముగ్గులేయంగ;
పగడాల; చెమ్మచెక్క;
పందిరేయంగ

పందిట్లో పాపరాజు
పరుగులె త్తంగ
పాలీయ వచ్చెనా;
పడతి పద్మాక్షి
పందిట్లో అబ్బాయి
పెళ్ళిచేయంగ

౨ ఒప్పుల కుప్ప;
వయారి భామ!
సన్నబియ్యం;
ఛాయ పప్పు
చిన్న మువ్వ;
సన్న గాజు!
గూట్లో రూపాయి;
నీ మొగుడు సిపాయి.

3 చిప్ప చిప్ప గోళ్ళు;
సింగరాజు గోళ్ళు;
మా బావి నీళ్ళు;
మండాప రాళ్ళు!
మా మామ కాళ్ళు;
మంచము కోళ్ళు.

౮ చెన్నపట్నం; చెరుకుముక్క;
నీకోముక్క, నాకోముక్క;
ముక్కా; ముక్కా; ముక్కా;

౯ వానల్లు కురవాలి;
వరిచేలు పండాలి;
బుడుగో; బుడుగో;
వరిచేలు కొయ్యాలి;
పాలేళ్ళు నూర్చాలి;
బుడుగో ? బుడుగో;
కావిళ్ళ తేవాలి;
గాదెల్లో పోయాలి
బుడుగో; బుడుగో;
మా నాన్న తియ్యాలి;
మా దాసి కివ్వాలి
బుడుగో; బుడుగో;
మా దాసి దంపాలి;
మా యమ్మ కివ్వాలి
బుడుగో; బుడుగో:
మా యమ్మ వండాలి;
మా బొజ్జ నిండాలి
బుడుగో; బుడుగో.

బాలికలే గాక; కొందరు స్త్రీలు పెద్దవారు సహితము "చిన్నీ చిన్నీ" ఆట ఆడుకొందురు.

## చిన్నిబిన్ని ఆట-పాటలు

రెండు జట్లుగా, ఉజ్జీలు వేసుకొని; ఒకరికొకరు జట్టా పట్టీలు కట్టుకొని, ఒకజట్టునకు, మరొకజట్టు, అభిముఖముగా నిల్చి, వెనుకకును, ముందునకును, మందగమనములతో, నటించుచు, ఈ పాట పాడుదురు. (ఈ పాటలో అనేక మకుటము లున్నవి. ప్రతీ మకుటమును ఒక్కొక్క చరణములో చూపుచున్నాడను).

1 వ జట్టు:- చిన్నీ; బిన్నీ; పిల్లుందా ?
సింగలగౌరు పిల్లుందా ?
తాడే బేడే పిల్లుందా ?
జాల్లింగం పిల్లుందా ?
తామరసిరి మొగ్గలు ?

2 వ జట్టు:- చిన్నీ; బిన్నీ; పిల్లుంది;
సింగగౌరు, పిల్లుంది.
తాడేబేడే పిల్లుంది.
జాల్లింగం పిల్లుంది.
తామరసిరి మొగ్గలు.

1 వ జట్టు:- భుజభుజ రేకుల పిల్లనిస్తారా ?
బుజ్జారేకుల పిల్లనిస్తారా ?

స్వామిగండం పిల్లనిస్తారా ?
సౌభాగ్యవతి పిల్లనిస్తారా ?

2 వ జట్టు:- భుజభుజ రేకుల, ఏంనగలు ?
బుజ్జా రేకుల, ఏంనగలు ?
స్వామిగండం, ఏంనగలు ?
సౌభాగ్యవతికి ఏంనగలు ?

1 వ జట్టు:- గుజుగుజు రేకుల. జడకుచ్చులు;
గుజ్జా రేకుల, రాగిడీ
స్వామిదండల, చంద్రహారాలు
సహారాజులుమొచ వడ్డాణం.

2 వ జట్టు:- జానిమ్మపండుకు చాలవు;
తామర మొగ్గకు చాలవు;
చిట్టిలక్ష్మికి చాలవు;
శృంగార గౌరికి చాలవు

1 వ జట్టు:- చిన్నీ; బిన్నీ; కట్నమేమి ?
సింగలగౌరి; కానుకేమి ?
తాడేబేడే ఏం లాంఛనం ?
ఏం నడవళ్లు.
జాల్లింగం తామరసిరి మొగ్గలు.

2 వ జట్టు:- చిన్నీ బిన్నీ; వెయ్యోలు,
సింగగౌరి నూటపదహార్లు

తాడేబేడే ఉంగ్రాలు.
జాల్లింగం మురుగులు;
తామరసిరి మొగ్గలు;
1 వ జట్టు:- పసినిమ్మపండకు చాలవు.
వరహాల కుప్పకు చాలవు.
ముద్దుబాలునికి చాలవు.
మోహాన రూపునికి చాలవు.
తామర మొగ్గల్లా!

ఈగకంకములపల్లవులను,యిష్టానుసారముగ పాడుచు, ఒకరినొకరు ప్రశ్నించుకొనుచు, జవాబులు చెప్పుకొనుచు, వధూవరుల కులగోత్రములు, వయస్సులు, నగలు, కట్నములు, కానుకలు, అడుగుచు, పెళ్ళిసంబంధము కుదుర్చుకొని, పెళ్ళి చేయునట్లుగా, పాడుచు? పెళ్ళయినపిదప.

1 వ జట్టు:- ఇందూ; వియ్యాలవారు,
సందేహామందనివారు,
అందరికానంద మానొనవున్
2 వ జట్టు:- మిఠాయి లంటారు;
మినపసున్నుండంటారు
గుటుకు. గుటుకు, మంటారమ్మ పెళ్లీవారు.
1 వ జట్టు:- కూరే. వంకాయ కూర;
మారే మారేమి లేదు;
నెయ్యన్న పొయ్యరమ్మ! నేర్పుగలవారు.

ఈవిధముగా పాడి, యీ యాటను ముగింతురు.

పురుషులు హరికథలతోను, ఆటపదములతోను; భజనలతోను, కోలాటములతోను ఆనందింతురు.

కోలాటమునే "కోపులు" అని యందురు. వీటిలో 30 రకములున్నవి.

## మూనకోపు-ప్రేమగీతము

పల్లవి:- వానేల గురిసెనో; రాజో; నాస్వామి;
వరదరాజుల పువులవాన-ఔను-
మళ్ళి గురిసిన పువుల వానో; నాస్వామి;
మగువ దగ్గిర పేటలోను ॥వా॥

౧ చ॥ చీరెల్ల చిత్తారునేతో; నాస్వామి;
ఒళ్ళెల్ల జవ్వాదిపూత;-ఔను-
ఎల్లయెడ్లను దున్నునాడ; చినవాడ;
యెల్లుండినే వెళ్ళిపోత ॥వా॥

౨ చ॥ వెళ్ళిపోయే చిన్నవాడ; నారాజ;
వేళ్ళనిండ; ఉంగరాలు-ఔను-
ఉంగరాలు చెయ్యిచూస్తే; నాస్వామి;
ఉండదయ్యా; ముండ మనసు ॥వా॥

3 చ॥ ముంగటేరు దున్నువాడో? నాస్వామి
ముత్యాలపోగులవాడ?-ఔను-
సాళుదప్పక దున్నుతావా? నారాజు;
దారిదప్పక నేనె వస్తా ॥వా॥

౩ చ॥ కావిడేసుకు నువ్వు రారో! నారాజ;
కడవబట్టుక నేనె వస్తా;—ఔను—
నీటిమీద కొంగుపరచి; చినవాడ
నిద్దురే నీకిచ్చి పోతా!—॥వా॥

౪ చ॥ కొండమీద కొజ్జు చేసో, నాస్వామి!
కొయ్యబోతే; రెడ్డిసాని;—ఔను—
రెడ్డిసాని; రొమ్ముమీద; నారాజ!
గోగుపువ్వే గొడుగునీడ—॥వా॥

## చక్రంకోపు-వలపుగేయము

పల్లవి:— ముంగ టేరు; దున్నువాడ;
ముద్దుల మేనత్త కొడక;
దాపటెద్దుకు దప్పికాయెను

అనుపల్లవి:— ఓ!...ఓరందకాడ; నరసయ్య బావ;
సీలదిప్పి; నిలాబెట్టబ్బి ॥ఓ॥సీ॥

౧ చ. దూరబారము దున్నబోకు,
దిప్పలెక్కి చూడలేను;
ఊరుముందర; ఉలవ చల్లబ్బి,
ఓ...ఓరందకాడ! నరసయ్య బావ;
ఉలవ కోతకు పిలువనంపబ్బి ॥ఓ॥ఉ॥

౨ చ. నూగునూగు మీసమోడ!
నువ్వుచేను కాచేవాడ;
నాకు చేరెడు నువ్వులంపబ్బి;

ఓరందకాడ; నరసయ్యబావ;
చిమ్మిలుండలు చేయగలనబ్బి ॥ఓ॥చి॥

3 చ. ఏటి అవతల చిన్నవాడ!
వెనక ఏరు దున్నువాడ!
తెప్పగట్టి తేలుదామబ్బి,
ఓ రంకాడ; నరసయ్య బావ;
ముప్పతిప్పలు; మూలలేలబ్బి ॥ఓ॥ము॥

(ఇది కోలాటకీర్తనము. తాళం భజన, చిడతల భజన, పాటలు, ముందు చూపబడును. ఈవిధముగ, ఈ సంవత్సరాది పండుగను, ఆనందాతిశయములతో, ఆబాలగోపాలము ఆచరింతురు.

విశేషాంశము:—ఈ ఆటపాటలలో ననేకరకములును; ఒకదానికే వివిధ మకుటములును కలవు. అవి చూడగోరువారు "సెలయేరు" అనే గ్రంథమును తిలకించ ప్రార్థితులు. నా సంపాదిత జానపదగేయములను హైదరాబాదు తెలంగాణా రచయితల సంఘంవారు. ఎడిట్ చేసినారు. ఆ పుస్తకము దేశోద్ధారక గ్రంథమాల శ్రీ వట్టికోట ఆళ్వారుస్వామిగారిచే అచ్చువేయించబడినది. "సెలయేరు" కన్న మిన్నగా "మిన్నేరు" అనే జానపదగేయసాగరము ఎడిట్ చేసి, అచ్చువేయించుటకు పైవారలే పూనుకొన్నారు.

గమనిక:

చైత్రమాసములో వచ్చే; వసంతోత్సవములు (మాధవపూజలు) శ్రీరామనవమి, మొదలగు పర్వదినములను గురించి ద్వితీయభాగములో వ్రాయబడును.



# ౨ దసరా

శత్రుసంహారార్థమై, విజయయాత్రలు చేసిన; వీరాధి వీరులను స్మరించే పర్వదినము దసరా. ఇది ప్రజల జీవిత ములో నూతనోత్సాహమును; క్రొత్తశక్తిని; పురికొల్పు చున్నది. "దసరా" అనగా 'పదిరోజులని యర్థము. దీనినే "దశరా" అనికూడ పిలుతురు. "దశపాపహరా" అనగా పది పాపములను; పరిహరియనది కావున దీనికీ నామ మేర్పడి నది. విజయమును; కల్గించునదగుటచేత "విజయదశమి" అని కూడ వాడుదురు.

అర్జునుడు ఉత్తరగోగ్రహణసందర్భములో; "శమీ పూజ" "ఆయుధపూజ" లు చేసి విజయమును పొందెను. కాబట్టి దీని కీపేరు వచ్చెనని కొందరనుచున్నారు. కాని; శ్రీరామచంద్రుడు సీతను వెదకుచు; ఋష్యమూకపర్వతము నందు నారదమహర్షి చేత బోధితుడై; అట "శరన్నవరాత్రి దేవీపూజలు" గావించి; దశమి దినమును ముగించుకొని; లంకపై దాడివెడలి; జయమును పొందెను. కనుక నాటినుండి యు దీనిని పవిత్రదినముగ నెంచి; "విజయదశమి" అనివాడు చున్నారని కొందరును చెప్పుచున్నారు "లంక" అదే సాంఖ్యముకూడ యిందిమిడియున్నది.

వర్షకాలము పోయి; శీతకాలము ప్రారంభముకా బోయే కాలము. ఆశ్వీయుజమాసము, శరదృతువు, అగుట

యును శీతాకాలమగుటచేత; జలాశయములందలి; నీరు బురద విరిగి; నిర్మలోదకములుగ మారును. జలప్రవాహములు తగ్గును. రాకపోకలకు సౌకర్యములు కల్గును. భూమి సస్య శ్యామలమై కన్నుల పండువుగానుండును. ప్రకృతి ఆనంద దాయకమై విరాజిల్లుచూ; సమస్త ప్రాణికోటులను సంతోష సంభ్రమాతి రేకములతో నోలలాడించుచుండును.

మన పూర్వపు రాజులు, దండయాత్రలు చేయుటకు, ఉపయుక్తకాలముగ నూహించి ఆయుధపూజ చేయుచుండిరి. ఈ పర్వదినమునకు ముందు; ఆశ్వీయుజ శుద్ధ విదియ లగాయితు; దశమిలోపున, పాఠశాలలయందుండు బాల బాలి కలు; తమ గురువులతో; "శిక్షించిన ఆయుధ పూజ" అను గిలకలను పట్టుకొని; యుద్ధోపకరణములకు, చిహ్నము గా; "జయాభిజైభవా!" అను నినాదములు చేయుచు, మహో త్సవముతో; బుక్కాయి; పువ్వులు; సంచుల నిండా పూరించి; శ్రీ బమ్మెర పోతరాజకృతమైన నారాయణశతకమునందలి,

"మ॥ ధరసింహాసనమై, నభయంబు గొడుగై । తద్దేవతల్ భృత్యులై;
సిరి భార్యామణియై, విరించికొడుకై, । శ్రీగంగ సత్పుత్రియై,
పరమామ్నాయములెల్ల వంధిగణమై । బ్రహ్మాండ మాకారమై
వరుసన్నిఘన రాజసంబు నిజమై, వర్ధిల్లునారాయణా!"

అనే పద్యమును, విరుపులతో ముందు కొందరు చెప్పు చుండఁగా, వెనుకనున్నవారు "జయ; జయ;" అను నినాదములతో వెంబడించుచుందురు. ఆనాటి రామలక్ష్మణులను స్ఫురణకు తెచ్చుచుందురు.

"సీ॥ పార్వతీ పతి తెల్పు। పాలసంద్రము తెల్పు
కామధేనువు తెల్పు। కంచు తెల్పు॥

"సీ॥ అరుణోదయ మెరుపు। అరుణాచల మెరుపు
అర్కమండల మెరు। పగ్ని యెరుపు॥

సీ॥ ఇంద్రాచలము నల్పు॥ ఇంద్రవజ్రము నల్పు
ఇంద్రనీలము నల్పు। యముడు నల్పు॥

సీ॥ శ్రీతరుణీమణీ। పీతాంబరము పచ్చ,
కమలమిత్రుని తురం। గంబు పచ్చ॥

అనెడి; ఈ నాలుగు పద్యములలో; తెలుపు, ఎరుపు, నలుపు, పచ్చ, రంగులుగల, సముదాయములను, వర్ణించుచు, ముందరి పాటకులు చెప్పుచుండ, వెనుకవారలు, "జయ" అనెడి నినాదములతో; వీరోల్లాసముగ; వీధుల వెంబడిని, ఊరేగుతు; తమ్మాహ్వానించిన వారిండ్లకు వెళ్ళి; ఒకజోడు ముందుపాట చెప్పుచుండగ; మిగిలినవారందరును; వంతపాటగా; ముక్త కంఠముతో పాడుదురు.

సూచన:- ప్రస్తుతము అచ్చులోనున్న పాటలుగాక; నావద్ద, అముద్రితముగానున్న కొన్ని పాటలను, మచ్చునకై కొన్నిటిని ఉదహరించుచుంటిని.

## 1 వినాయక ప్రార్థన

"శ్రీవినాయక, రాజ । శేఖర తనూజ!
భావజాంతక, కోటి । భానుసమ తేజ!
నాగ కుండల భూష । నవ్యసుమ శేష!
ఆగమార్థవిశేష । ఆర్యజనపోష!
సేవించెదమునిన్ను । శ్రీవిఘ్నరాజ?
జయాభిజయభవ । దిగ్విజయభవ॥"

## 2 సరస్వతీ ప్రార్థన

"సరస్వతీ! మతి మాకు । చాలంగనిమ్మ;
పరమేష్ఠిరాణి; మము । పాలించవమ్మ:
లలిత పుస్తకపాణి! యళినీలవేణి!
పల్లవారుణపాణి! । పరమకళ్యాణి;
సమ్మతిగ నినుగొల్తు । సద్గుణకదంబ!
మమ్ము ధన్యులఁజేయు । మాశారదాంబ ॥జ॥"

## 3 శ్రీహరిస్తోత్రము

"శ్రీహరి; కరుణాకటాక్ష । వీక్షణాలంకార!
అర్థిజనకుముద చంద్రోదయ । ఆశ్రితవిద్వజ్జనాధార;
సకలసామ్రాజ్య లక్ష్మీనివాస! సకల సద్గుణ సంపద్వి
లాస! జ"

## 4 ఈశ్వరుని స్తవము

"శ్రీగౌరి హృదయేశ! శ్రీనీలకంఠ!
గంగాజటాజూట! కాలవిధ్వంస!
నారద నుతదేవ! నాగేంద్రభూష!
కారుణ్యమున బ్రోవుము । కాశీపురీశ! ॥జ॥"

## 5 దశావతార స్తోత్రము

"మరుజనక; మమ్మేలు । మత్స్యావతార;
గురుతుగా, కృపనేలు । కూర్మావతార;
వరదుడవు; గదయ్య । వరహావతార;
సిరులు గురియించు । నరసింహావతార;
వక్షమున సిరిగల్గు । వామనావతార;
రక్షించు, మము పరశు । రామావతార;
రాక్షసాంతక రఘు । రామావతార;
పాలించవే! బల । భద్రావతార;
సేవకుల నేలు । శ్రీకృష్ణావతార;
భావజాకార! శ్రీ । బౌద్ధావతార;
కావవే! మము । కలికావతార! ॥జ॥"

ఈ స్తోత్రపాటలు తరువాత, రామాయణ, భాగవత సంబంధములగు పాటలు పాడుదురు.

## 6 రామాయణ సంబంధపుపాట

"అంజనీ గర్భ మం । దమర జన్మించి,
రంజిల్ల కాకుత్థ్స । రాముని భజించి,
లంకలోపల జొచ్చి । లంకిణిని దున్మించి
జంకకను రాక్షసుల । బింకమణగించి,
పంకజాక్షి వార్త । పతికి నెఱిఁగించి,
సంకటము బాపిన । స్వామిహనుమంత ॥జ॥"
"అంకించి, ఉంగరం । బాలవాలంది
ఆంజనేయులవారు । ఉగ్రుడై నిలచి॥"

ఇటువంటి రామాయణపాటలును, ముఖ్యముగా, శ్రీకృష్ణ లీలలు (భాగవతసంబంధములు) పాడుచుండగా, పెద్దలెంతో ఆప్యాయముగా వినెదరు.

## 7 శ్రీకృష్ణలీలలు

"రేపల్లెవాడలో । గోపెమ్మ మేము,
కాపురములుజేసి । కడతేరలేము"
"ఏమరా? శ్రీకృష్ణ । యింతయాగడము.
తగు నటర నీకిది । జగతిలోపలను"
"ఏమిరా? గోపాల । యెంతజాణవుర;
రమణులిళ్ళకుబోయి । రవ్వతెచ్చెదవు"
"దొంగర్రి; దొంగర్రి; । దొడ్డ దొంగర్రి;
దొరికినాడే వీడు । దొంగవాడేను"

"గోపిల స్త్రీలమ్మ। వారలు గొల్లభామలమ్మ;
ఒకరికి, ఒకరమ్మ। భామలు, వాలలాడిరమ్మ"

ఇవి భాగవతములో దశమస్కంధమునందలి శ్రీకృష్ణలీలల కథాసందర్భములు. పెద్దలు చవులూర వింటారు ఈపాటలను.

# 8 బాలకుల దీవనలు బ్రహ్మదీవనలు

పసిపిల్లలు, ముసలివారిని దీవించుట, ముసలివారు మురియుట యెంతో ఆనందముగ నుండును.

"శ్రీరస్తు, విజయోస్తు। దీర్ఘాయురస్తు
ధనకనక వస్తువా। హన సిద్ధిరస్తు
ఆశ్వీయుజ శుద్ధ। మహార్నమినాడు
శాశ్వతాశీర్వాద। సత్యవాక్యములు
బాలుర దీవనలు। బ్రహ్మదీవనలు
బాగుగా మీకిపుడు। బ్రహ్మాయురస్తు
పసిబాలురము, మా। పద్యములు వినియు
కసరికొట్టక, మమ్ము। కరుణగైకొనుడి
నలజయంతులవంటి। నందములు కలిగి
తెలివి, చక్కని। చాల కూతుళ్ళుకలిగి
అల మన్మథులవంటి। యల్లుండ్రుగలిగి
బలవంతులైనట్టి। బంధువులుగలిగి
పుడమిలో, సెనలేని। భోగముల్ గలిగి

వడుగులు, పెండ్లిండ్లు । వరుసగా గలిగి
పొందుగా నవరత్న । భూషలు గలిగి
ధనధాన్యములు గలిగి । ధర్మములు గలిగి
ధరణిలో నాచంద్ర । తారార్కముగను
చాల సంతోషమున । చెలగుచు మీరు
పుడమి వర్ధిల్లుడీ । పూజ్యులై యెపుడు ॥జ॥"

## 9 పొగడ్త పాటలు

స్తుతి; స్తోత్రములు ప్రారంభించి, యెల్లవారల కల్లారు ముద్దులు కురిపించెదరు.

"బంగారు, జలతారు । రంగయిన పాగ
ముత్యాల పోగులు । ముద్దుటుంగరము
చేతి కంకణబిరుదు । చంద్రహారములు
నిలువుటంగీలును । నీలాపు మణులు
గోమేధికాపుష్య । గోలును రత్నములు
మాణిక్యకిరీట । మహితప్రతాప
అయ్యవారికిచాలు । అయిదువరహాలు
చిన్నవాళ్ళకుచాలు । సిరిసెనగపప్పు
పిల్లవాళ్ళకుచాలు । పప్పుబెల్లాలు ॥జ॥"
" మాటాడి తప్పవు । మన్మథాకార!
సాటిలేరెవ్వరు । సద్గుణాకార;

సరసనీవచనముల । జాజిపూతోట;
నరసతో నీమాట । నరహాలమూట
అసమానగుణధీర । అంగజాకార
వసుధలో (ఇంటిపేరు) వారి । వంశవిస్తార
గరిమ (తల్లిపేరు) । గర్భసుకుమార
భళి భళీ! (అసామిపేరు) భాగ్యదేవేంద్ర ॥జ॥"

## 10 దుబ్బునిరసన పదములు

స్తుతిపాఠములు పూర్తికాగానే, లోభగుణముగలవారిని విరసించుచు, కొన్ని పదములు పాడుదురు. ఈ శ్రేణిలో "రూక పద్యము" అనునది చాల ప్రఖ్యాతినందినది.

"ఇవ్వలేని లోభుల । యిళ్లకు బోము
మూటగట్టుట యేమి । మోక్షముగదయ్య
కోటినార్జించిన । కూటికెగదయ్య
మటుమాయవాదులను । నురియడుగబోము
నీటుగన శాస్త్రోక్తు । నేశివ్వరయ్య
సాటెవరు మీతోను । సరసముగదయ్య
అయ్యవారికిచాలు । అయిదు వరహాలు
తెప్పించి కట్నంబు । లిప్పించరయ్య
మాపప్పబెల్లాలు । మాకు దయచేసి
శీఘ్రముగ నంపుడీ । శ్రీమంతులార ॥జ॥"

# 11 తమ ముస్తాబు పాట

తా మెట్లు ముస్తాబు అయినా మో "చూడండి" అని, తమను వర్ణించుకొనుచు పాడెదరు,

"చెలువైన, జనకట్లు । చంద్రహారాలు,
మురిడీలు, గొలుసులు, । ముద్దుటుంగాలు
పచ్చల పోగులు । హెచ్చుతాళీలు
బొమ్మంచు పంచెలు । బొంచైనపాగ
జలతారు వోణీలు । జాలురుమాళ్ళు
అంగీలు నడికట్లు । అమరగానగలు
తొడిగితిమి, ముస్తాబు । తోడ గిలకలను ॥జ॥"

# 2 ప్రాధేయపు పదములు

"కటకటా మీకెంత । కరుణలేదయ్య
యిటువచ్చి యడుగమా । కిది పద్ధతయ్య"
"ఏపయా మీదయా । మామీద లేదు.
యింతసేపుంచుట । యిదిమీకు తగునా?"
"ఉత్తమాజనులార । చిత్తగించండి
ఆలస్యముంచకం । డాక లవుతుంది
ఆకళ్ళచేత, మీ వాకిళ్ళలోను
ఉంచుట మీకిది । మంచిపని కాదు.
పావులా బేడైతె । పట్టేదిలేదు
అర్థరూపాయిస్తే । అంటేదిలేదు

ముప్పావులాయిస్తే। ముట్టేదిలేదు
రూపాయియిస్తేను। ప్రాపకముకాదు
హెచ్చువరహాయిస్తే। పుచ్చుకొంటాము
పైపావులామాకు। పప్పుబెల్లాలు
తెప్పించి కట్నంబు। లిప్పించరయ్య
శీఘ్రమే పంపుడీ। శ్రీమంతులార ॥జ॥"

వినేవారలకు జాలి కలుగునట్టి పాటలను పాడి; తల్లిదండ్రుల కల్లారుముద్దులు పుట్టించి; సంభావనములు సంపాదింతురు.

## ఈ పండుగలోని భాగములు

విజయదశమిలో 1 దేవీపూజ 2 ఆయుధపూజ 3 పొలమేర దాటుట 4 పారువేట 5 జమ్మి (బేతాళ) పూజ మొదలగునవి ముఖ్యాచారములుగ నున్నవి.

## 1 దేవీపూజ

ఆశ్వయుజ శుద్ధ విదియనాడు, అనఁగా— నెలపొడుపునాడు దేవిని నిలిపి, తొమ్మిది రాత్రులు పూజింతురు. దేవీపూజ రాత్రులు ప్రధానముకావున, నవరాత్రులే, సమాసవశమున "దేవీనవరాత్రులు" అని వాడుచుందురు. ఆశ్వయుజ శుద్ధ దశమి శరన్నవరాత్రులు గడచిన మరుచటిదినము. ఇది "దుర్గపూజ" తో సంబంధము కలదగును.

గృహములు; పచ్చని తోరణములతోడను, గడపలకు పసుపు కుంకుమలతోడను; వాకిళ్ళయందు చిత్రవిచిత్రములైన

ముగ్గులతోడను చక్కగ నలంకరించెదరు. మేళతాళ, నృత్య గీతాదులతోను; బంధుమిత్రులతోను; గూడి "అపరాజిత దేవీపూజ" చేయుదురు. అపరాజిత దేవి=పరాజయము లేని దేవతకు; రకరకముల పిండివంటలతో. ననేక బక్ష్యాన్న విశేషములతో నైవేద్యమును చెల్లించెదరు.

## 2 ఆయుధపూజ

దశమినాఁ డుదయమున; వారివారి వృత్తిపనిముట్లను; శుభ్రపరచి; పసుపురాచి; కుంకుమబొట్లు పెట్టి, మంచిగంధము రాచి, ధూప దీప నైవేద్యములతో పూజించెదరు.

## 3 పొలిమేర దాటుట

దశమినాటి సాయంకాలము, మేళతాళములతో, దేవి నూరేగించుచు; మల్లయుద్ధములు; సాము గరిడీలు; మొదలగు వీర బలప్రదర్శనములతోడ, పొలిమేరవరకు వెళ్ళెదరు.

## 4 పారువేట

పొలిమేరలో, ఏదేని జంతువును; పరుగెత్తించి, వేటాడి కొట్టుదురు. అప్పుడు తమ పరాక్రమ ముద్దీపించుకొనునట్లు సంభ్రమాతిశయములతో "జై; జై" అని నినాదములు చేయుదురు.

## 5 శమీపూజ (భేతాళపూజ)

జమ్మిచెట్టుమీఁద, భేతాళుఁడుండునని, నమ్మెదరు. ఆ చెట్టుమీఁదనే "పంచపాండవులు" ఆయుధములను దాచి;

అజ్ఞాతవాసము చేసినారు. ఉత్తరగోగ్రహణములో, యర్జు నుఁడు, శమీవృక్షమును; భేతాళునిని; పూజించి, ఆయుధ ములు తీసికొని, జయమును సంపాదించినాడు. కనుక దానికి, స్మృతిచిహ్నముగ.శమీపూజ చేసి, జై;భేతాళా! జై;భేతాళా! జై;భేతాళా! అంటూ; ఏకకంఠముతో నినాదములు చేయుచు జమ్మికొమ్మలను నరికి, ఆ పత్రిని తలమీదను, చెవుల సందు లందును ధరించి, మహోత్సాహముతో, జనసమూహము వెనుకకు తిరిగి వచుచ్చును.

అనంతరము దేవిని గంగలో కలిపెదరు. శమీపూజ వలన ఆనాటి పాండవులను జ్ఞాపకమునకు తెచ్చెదరు. పూర్వపు రాజులు, దండయాత్రలుచేయు, యీపండుగను, నేడిట్లు ముగించుచున్నారు.

విశేషాంశములు:- రాజమహేంద్ర వరమువంటి పట్టణములలో, రివి న్యూ శాఖోద్యోగులు, కత్తులతోను, కాగితములతోను ఏనుగను కట్టి చక్కగా, అలంకరించి. దశమి నాడూరేగించు చుండిరి- మైసూరులో. విజయదశమి గొప్పగాజరుగుచుండును. అక్కడి వేడుకలు కన్నుల పండువుగా. నుండుట చేత, నెక్క డెక్కడి నుండియొ, ప్రజలు వచ్చుచుందురు. అక్కడ రాజ దర్బారు, రాజనగరు, రాజవీధి, రాజలాంచనములు, రాజరికము. ప్రత్యక్షము గాచూడవచ్చును.



# 3 దీపావళి

శరన్నవరాత్రులతో ప్రారంభించి; దీపావళిమహోత్స వముతో, అశ్వయుజమాస మంతమగుచున్నది. విజయదశమి వెళ్ళిన; యిరువది దినములకు, అనగా:- ఆశ్వయుజ బహుళ అమావాస్యకు "దీపావళి అమావాస్య" అని చెప్పుదురు. యావద్భారత దేశములో; ప్రజలందరు, పరమానందమున పాల్గొనే పండుగలలో, దీపావళి ప్రధానమైనది.

దీపావళి : దీపముల వరుస, అనీ యర్థము. దీపావళి కథావిశేషములు పెక్కురీతులుగా చెప్పుచున్నారు. దీనికి పూర్వపు దినము నరకచతుర్దశి.

## వివిధాభిప్రాయములు

శ్రీరామచంద్రుడు, రావణవధానంతరము, సీతా లక్ష్మణ వానర సమేతముగా; నందిగ్రామమునకు వచ్చి; భరతుని కలుసుకొని; వెంటనే పట్టాభిషిక్తుడైనాడని కొంద రును, శ్రీ మహావిష్ణువు వామనావతారమెత్తి; బలిచక్రవ ర్తిని మూడడుగుల నేలను యాచించి; బలిని పాతాళమునకు త్రొక్కినాడని మరికొందరును; నరకాసురుని బాధలను భరించ లేక; దేవతలు శ్రీకృష్ణమూర్తితో మొరపెట్టుకొనగా; శ్రీకృష్ణమూర్తి సత్యభామాసమేతముగా యుద్ధమునకువెళ్ళి నరకుని సహరించెననియును, ఆదినమే నరకచతుర్దశియనియు;

మరునాఁడు, నరకుని మరణమునకు, నరులూ; సురులూ; ఆనం దించి, దివిటీలు వెలిగించుకొని, తమ సంతోషమును, వెలి బుచ్చుకొనుచున్నారని, మరికొందరును చెప్పచున్నారు.

ఆర్యావర్తనమును; ఏకచ్ఛత్రాధిపత్యముగా పాలించిన; విక్రమార్క చక్రవర్తి, యీదినముననే పట్టాభిషిక్తుడయినాడని కొందరందురు. దక్కనులోను; కొంకణములోను; గుజరాతులోను; విక్రమశకము యీనాడే ప్రారంభము. కావున దీనిని విక్రమశకములో సంవత్సరాదిగా నెంచుకొనుచున్నారు.

నరకబాధ విముక్తికొఱకు యమునిగుఱించి, ప్రార్థనలుచేయు దినము కాబట్టి; యిది "నరకచతుర్దశి" అని కొందరు చెప్పుదురు. అశోకుని కళింగదేశ విజయసూచకమని కొందరు భావించుచున్నారు.

## వివిధదేశ వాడుకలు

ఈ పర్వదినమును, ఉత్తరహిందూదేశములో, లక్ష్మీ పూజగాను; వంగదేశములో కాళీపూజగాను; తెలుఁగుదేశములో (1) నరకచతుర్దశి (2) దీపావళి; మాత్రమే పండుగలుగా నెంచుచున్నారు. జైనులు, కార్తీక కృష్ణ చతుర్దశి, "మహావీరుని–నిర్వాణలక్ష్మి" దినముగను, అమావాస్యను, మహావీరుని శిష్యుఁడగు "ఇంద్రభూతి–జ్ఞానలక్ష్మి" సంక్రమించిన దినముగాను భావించుచున్నారు.

ఇట్లు పలువురు, పలువిధములు భావించుచుండిరి. అయినను, సత్యాసత్యముల సంగతటులుంచి, బాగుగా పరిశీలించినచో; దీపావళినాటి రాత్రి దీపములు పెట్టి; యుత్సవములు జరుపుకొనుట; హిందూమతములోనేగాక; మతాంతరులలోకూడ యున్నది.

మహమ్మదీయ మతములో, మహమ్మదువారి విజయయాత్ర "షబేబరాత్" అనునది మన దీపావళివంటిదే. క్రైస్తవులలో "రోమన్ కాథలిక్కులు" చేయు దీపోత్సవము, మన దీపావళిని పోలినదే. బర్మాదేశములోను; ఇండోనీషియాలోను; దీపోత్సవములు చేయుటయును. మన దీపావళిఛాయలే!

ఆర్థికముగను, ఆధ్యాత్మికముగను, కూడ, యీపండుగ ప్రాధాన్యము వహించుచున్నది. అన్నిపండుగలును లలితకళలను పోషించుచున్నవి. కుటీర పరిశ్రమలకు దోహదమిచ్చుచున్నవి.

## పండుగ దినములు

దీపావళిని కొందరు పదమూడు దినములుగా భావించుచున్నారు. కాని; ప్రధానముగా; అయిదుదినములే.పండుగగా నిరూపించే, ఆచారమే యున్నది.

(1) నిధనత్రయోదశి (2) నరకచతుర్దశి (3) దీపావళి (4) గోవర్ధనోద్ధరణ (5) యమద్వితీయ అనునవి ప్రధానముగానున్నవి.

# దేశాచారములు

ఉత్తరాదివారు, క్రొత్త చిఠాలు ప్రారంభించుట, తమ ధనకనక వస్తువాహనములను పూజించుట, సంవత్సర జాతక ఫలితములు చెప్పించుకొనుట, రూపాయిని యెగుర వేసి, దాని మోర్తనుబట్టి తమ యదృష్టమును తెలిసికొనుట, జలప్రవాహములో; దీపములను వదలి, అవి యారిపోయినచో తమ జీవితము లారిపోవుననియును; ఆరకుండా ప్రయాణము చేసినచో; తమ జీవితములు ప్రశాంతముగా నడచునని యును, యూహించుట. ఇటువంటి యాచారములను వారు పాటింతురు.

మన ప్రాంతమున, వ్యవసాయదారులు, తాము పండించిన కష్టములకు, ఫలితముగా "కేదారములు" అనఁగా పంటపొలములు సస్యములతో నిండి, కన్నులపండువుగా నుండుటచేత, "కేదారగౌరీవ్రతము" అనుదానిని. దీపావళి వెళ్ళిన మరుచటిదినమునందు చేయుదురు. కొండప్రాంతము లందు "గౌరమ్మ" పండుగలు చేయుదురు.

మార్వాడీలు "లక్ష్మీపూజ" చేయుదురు. కొన్ని ప్రాంతములందు; ప్రకృతికి ప్రతిరూపిణులైన; శక్తులను; (1) గౌరీ (2) లక్ష్మీ (3) సరస్వతీ " దేవులను పూజించెదరు దీనినే "శక్తిత్రయపూజ" అని వచింతురు.

"దీపములేని గృహమునందు లక్ష్మి నిలువదు".
"దీపారాధన లక్ష్మీకటాక్షము"
అని కొంద రాచరింతురు.

## ఆచరణవిధానము

నరకచతుర్దశినాడు; గడ్డితోను, కాగితములతోను, నరకాసురుని స్వరూప మమర్చి, ఊరేగింపుతో, యూరిబయటకు తీసుకొనివెళ్ళి దానిని తగులబెట్టి; అభ్యంగన స్నానము చేయుదురు. తదనంతరము, మతాబాలు; టపాకాయలు; కాల్చుదురు.

మరునాడు గృహములలో; వరుసగా, ప్రమిదలుపెట్టి; మంచినూనెతోగాని; నేతితోగాని; దీపములు వెలిగింతురు. దేవతాపూజలు చేయుదురు. చిన్నపిల్లలచేత, "దివిటీలు" కొట్టింతురు. అప్పుడు పిల్లలీ క్రింది పాటలు పాడెదరు.

## దీపావళి జానపద గేయము

"దుబ్బు; దుబ్బు; దీలామాస!
మళ్ళీవచ్చే నాగులచవితి.
పుట్టమీద పొట్ట కజ్జ"
"దిబ్బు; దిబ్బు; దీపావళి
బలుసుచెట్టుమీద పెద్దలార దిగిరండి"

దివిటీలు కొట్టిన తరువాత వారు తీపి తినవలయుననే నియమ

మున్నది. భోజనమయిన తరువాత, మతాబాలు, కాకర పువ్వొత్తులు, టపాకాయలు మొదలగు మందుగుండుసామా నును కాల్చెదరు. యావనవయస్కు వారలు, ఉప్పుపెట్లాలు కట్టి; అగ్గిపెట్టి; దానిని త్రిప్పుచూ; వీధులగుండా, ఆనందంతో తిరుగుదురు. అప్పుడు యీక్రింది పాటలు పాడెదరు.

## ఉప్పుష్లాటాలు త్రిప్పుతూ పాడే పాటలు

1 "అవిగవిగో! చుక్కలు;
దప్పసిరి; మొగ్గలు;
దూలాలు; చెక్కించి;
దుప్పట్లు, పరిపించి;
మంగళో, రల్లుడా;
మత్స్యావతారుడా;
కనకమ్మ విస్తాము;
పెళ్ళాడతావా?
అబ్బ; బ్బ; సిగ్గు ?
వరిపిండి ముగ్గు.

2 నెల్లుకూర; బలునుకూర;
ఎక్కడున్నది?
నాయనమ్మ; తోటలోను
నానుతున్నది,

చెట్లుమీాద; చెవులపిల్లి;
చెవ్వాచున్నది,
గట్టుమీాద; గంగిరెద్దు;
ఆడుతున్నవి.

రైతులు, కేదారగౌరీ వ్రతమును, గోపూజను, గౌరమ్మ పండుగను చేయుదురు.

## గోపూజాపదము

గోవు నాలుగుపాదములకును, ఫాలభాగమునకును, మెడచుట్టును, మూాపురమునకును, పసుపురాచి; కుంకుమ బొట్లు పెట్టి; ధూపదీపములతో ముమ్మారు ప్రదక్షిణముచేసి, హారతి యిచ్చుచూ.

పల్లవి॥ జయమంగళం । నిత్య శుభమంగళం
జయా! జయమంగళం । మహోత్సవమంగళం॥

1 చ:- పాదములు నాల్గిటికి । ఫాలభాగమునందు
పసుపు, కుంకుమ, పూలు । భక్తినుంచి
ధూప హారతులిచ్చి । దూడతో నీపూజ
మమతతోజేతుము, గో । మాత గైకొనుమా॥జ॥

2 చ:- పాలిచ్చి, భువిపవిత్రజల । పాలించు గోమాత
పెరుగు, వెన్నా నేయి । పేర్మినొసగి
పూనికతో కష్టించి । భూములను పండించి
మమ్ము పోషించు, గో । మాతరో; నీకు ॥జ॥

# కేదారి గౌరీ వ్రతము

దీనిని వ్యవసాయదారులే చేయుదురు. స్త్రీ లుపవాసముండి గౌరీదేవిని నిల్పి; పసుపు, కుంకుమ, పువ్వులు, గంధము ధూప దీప నైవేద్యములు చేసి యీపాట పాడుదురు.

## కేదారగౌరీ - జానపదగేయము

శుక్కురావారాన । సక్కంగ శ్రీలక్ష్మి,
అవతారమెత్తెనే । ఆదిలక్ష్మి,
సిరితోడనె వచ్చెనూ । మా నగరికి,
వచ్చె తన శాలలో । వలపటాలేసుక,
పుట్టినింటికి పోయి । ఏమి దెస్తివిగౌరు.
సిగ్గుపడతా నాతోన । చెప్పమందూ, ॥జ॥
"పసుపు కుంకుమాలు । పసుపురంగు చీరె;
మావారు పేదవారు । మాకు యిచ్చినవి
మిరపకాయ పట్టుచీర । మిరిమిట్లు గొలుపంగ
అల్లమో; బెల్లమో; । అరటిపండ్లు.
తెప్పించి యిచ్చినవి । కేదారగౌరమ్మకు॥జ॥
రంగైన పచ్చని । రైకతోడిగి
వెన్నకాచిన నెయ్యి! గిన్నెలబోసుక
అన్నలకు బోసి । నే తలలంటంగ
నీడు పున్నమనాడు । నేనొక్కపొద్దుండి
నిండయినకోనేట । స్నానమాడి

నేను దెస్తునమ్మా । వజ్రాలగాళీ
అల్లమో; బెల్లమో । అరటిపళ్ళూ!
తేనెతో మాగిన । తియ్యమామిడిపళ్ళు
తెప్పించి యిస్తురే కేదారిగౌరమ్మకు॥జ॥

నమస్కారములలో యీ పదమును ముగింతురు. పిదప అక్షంతలు వేసుకొని, వ్రతమును పూర్తిచేయుదురు. ("గౌరమ్మ" పండుగను గురించి, వివిధ ప్రాంతములందు వివిధవిధములుగ జేయుదురు. కావున రెండవ భాగములో యీ పండుగనుగురించి వివరింతును.)

ఉత్తరాదిని, స్త్రీలు తమ సోదరులను, ఆహ్వానించి, తలంటి; విందులుజేసి; కానుకలు పుచ్చుకొందురు.

మారువాడీలు, ధలరాశులను పూజించి; బ్రాహ్మణులకు, సంభావన లిచ్చెదరు.

కొన్నిచోట్ల, పార్టీలువేసుకొని; మందుగుండు కాల్చెదరు. తమిళులు యీపండుగను; చేయుదురు కా ; దీపములు పెట్టుదురు. లక్ష్మిపూజ చేయువారు, దీపములుపెట్టి; లక్ష్మిదేవిని పూజించి, హారతి చెల్లించుచు యీపాట పాడెదరు.

## లక్ష్మి మంగళహారతి

పల్లవి:–మహాలక్ష్మి యనినిన్ను । చాలగా బిలిచితే
ఓ లక్ష్మి నీకింత । జాలమేలా?
పాలసముద్రిని । పట్టిరో యని నిన్ను,

పలుమారు పిలిచితే । పాలించవేసుమ్మా!
మంగళం; మంగళం; మహాలక్ష్మి! మంగాళం।
మంగళం.

1 చ:- అలికిపూసిన యింట్లో । చిలుకుజల్లితినేను
మెళుపు చూపుతురావె । అలుకలేలా!
కళకళ నవ్వుచు । కలయిండ్ల నెక్కుచు
కలికిముద్దులగుమ్మ । చిలుకరావమ్మా ॥మం॥

2 చ:-ఒంటిగా నీవు, మా । యింటికి రావమ్మ
జంటబాయక నా । వెంటనుండూ
కంఠాన మెరసేటి । కంఠహారము లిత్తు
యింట్లోకి రావమ్మా । యిపుడు మహాలక్ష్మి॥మం॥

ఈవిధముగా ఆటలు, పాటలు, పూజలు, హారతులతో పండుగ వేడుకలు జరుపుకొందురు.

## పరమార్థము

ఆరోగ్యముగను; ఆర్థికముగను; ఆధ్యాత్మికముగను; కూడ యీ పర్వదినము ప్రాధాన్యము వహించుచున్నది. అజ్ఞానాంధకారములో, కొట్టుమిట్టాడుచున్న మానవులకు, జ్ఞానజ్యోతిమూలముగా, విజ్ఞానమును ప్రసాదించుటయే; యీ దీపావళి సూచించుచున్నది. దక్షిణాయనము రాత్రి వంటి దనియును; ఉత్తరాయనము పగలువంటిదనియును, పెద్దలు వచియింతురు. దక్షిణాయనమనే రాత్రి గాఢనిద్రలో

మునిగిన జనులు దీపావళియనే వేకువని తెలివిచెందినట్లును; ఉత్తరాయణమనే; పగటిలో ప్రవేశించునట్లును. సూచించుచున్నది. అజ్ఞానములోను; కష్టములలోను; మునిగియున్న జనులకు; దిపావళి తెలివిని తెప్పించి; వెలుగునిచ్చుచున్నదని రూఢియగుచున్నది. మందుగుండు కాల్చుటవలన, గాలిలో నుండే అనారోగ్యమును కలుగజేసెడి, క్రిములు నశించును. గాలి శుభ్రపడును. అందువలన, ఆరోగ్యకారణమగుచున్నది.

## కాలప్రధానము

ఈ పబ్బమునకు, కాలముతో సంబంధ మెక్కువగా నున్నది. ఆషాఢము నుండియు; ఆకాశము మేఘావృతమై, వర్షములు కురియుచున్నందునను; సూర్యకాంతి ప్రసారము తక్కువ కావడముచేతను; జనులలో యుత్సాహము తగ్గుట యును, అనారోగ్యము వ్యాపించుటయును, సంభవించును. రాకపోకల సౌకర్యములు బాగుగానుండవు. అగస్త్యోదయమయి శరదృతువు ప్రవేసించిననేగాని; నీరు కలకతేరదు. బాడి బంద యెండి రాకపోకల మార్గములు సరిగానుండవు. శరత్తు ప్రవేశించగనే; ఆకాశము నిర్మలమై; పుచ్చపువ్వవంటి; అచ్చవెన్నెలలు కాయుచూ; ప్రకృతికెంతో సంతోషమును కల్గించుచుండును. అందువలన, చీకటి నుండి వెలుగునకును; కష్టకాలమునుండి; సౌఖ్యవంతమగు కాలమునకును; నిరుత్సాహమునుండి; యుత్సాహమునకును, ప్రవేశించెడి కాలమే

శరత్కాలము. అన్నిఋతువులలోను, శరదృతువు నాయక మణివంటిది. కాలము; వాతావరణ, పరిస్థితులు; ప్రజల కుత్సాహమును కలిగించుచుండును.

మరియును సంవత్సరములో నుండే, రెండు ఆయనములలోను; దక్షిణాయనము పాపభూయిష్టమయిన దనియును; అశుభకరమయిన దనియును; అప్పుడు మృతిజెందినవారల కుత్తమ గతులు కలుగ వనియును; ఈ యారుమాసములలో స్వర్గద్వారములు మూసియుండుననియును. ఉత్తరాయనము, శుభకరమైనదనియును; అప్పుడు మరణించిన వారల కుత్తమ గతులు కలుగుననియును; ఈయారుమాసములలో స్వర్గద్వారములు తెరచియుండుననియును; ఆర్యులు వచించియున్నారు.

అందులకు పరమ నిదర్శన మేమనఁగా?—భారత యుద్ధములో; భీష్ముడుఁదక్షిణాయనమున, అంపశయ్యమీఁదపరుండి; ఉత్తరాయనమున, దేహమును చాలించినాడు.

కష్టకాలములోనే, దేవతలను, పూజించడమును; ప్రార్థించడమును; నోములు; వ్రతములు; జరుపడమును; పరిపాటిగా జరుగుచుండును. దక్షిణాయనము, అటువంటి యశుభకాలము, కాబట్టే; నోములును; పూజలును; చేయుచు, ఆ యశుభ పరిహారమును గావించుకొంటున్నారు.

పూజా పురస్కారముల సంగతి యెట్లున్నను, ఈ పండుగ దినములలో; విందులు; వినోదములు; మిక్కిలిగానుం

డును. అందరును, ఆనందముగా కాలమును గడుపుదురు. క్రొత్త అల్లుళ్లను పండుగకు తీసుకవచ్చి; అప్యాయముతో కట్నములును; కానుకలును; యిచ్చి, వారిని సంతోష పెట్టుదురు.

ఇది. పిన్నలకు పండుగ; పెద్దలకు పండుగ.
అందరికీ పండుగే.



# ౪ సంక్రాంతి

సంక్రాంతి, లేక సంక్రమణము. సం+క్రమణము=సూర్యుడు ముందుండే రాశిని, విడిచి. మరొక రాశిలో ప్రవేశించుటయని యర్థము. కావున యిది సూర్యునుద్దేశించి చేయునట్టిపండుగ.

సంక్రాంతి మాసమున కొకటివంతున, సంవత్సరమునకు పన్నెండు సంక్రాంతులు వచ్చును. సంక్రాంతులలో మకర సంక్రాంతి ముఖ్యమైనది.

సూర్యుడు కర్కాటకమునుండి; యించుక దక్షిణాభిముఖముగా సంచరించుటచేత; దక్షిణాయనమనియు; కర్కాటకమునుండియించుక, ఉత్తరాభిముఖముగా సంచరించుటచేత;

ఉత్తరాయణమనియు; చెప్పుచున్నారు. సూర్యుడు ఋతుత్రయ గామిగా సంచరించుదానికి "అయనము" అందురు.

మార్గశీర్షమునుండి; ఆరునెలలు, ఉత్తరాయణము, జ్యేష్ఠమునుండి, ఆరునెలలు దక్షిణాయనము.

ధనుస్సంక్రాంతికిని; మకరసంక్రాంతికిని; మధ్య అనఁగా నెలపెట్టినతరువాత, విష్ణాలయములలో; ప్రొద్దుటే బాల భోగములు చేయుదురు. ప్రొద్దుననే గొబ్బెమ్మ సంబరమునకు వచ్చి, చిన్నపిల్లలు గుడికివెళ్ళి, చక్కెరపొంగలి; పులిహోర; దద్ధ్యోజనము వగైరా ప్రసాదము లానందముగా నందుకొందురు. దేవునికి పైవాటిలో రోజున కొకటి నివేదనచేయుదురు.

సంక్రాంతిరోజులలో సంక్రమాణపురుషుఁడు ప్రతీయేఁడును; ప్రత్యేక లక్షణములు కలిగియుండును. ఆయన నామము; వేషము; ధారణసముదాయము; వాహనము లను బట్టి, దేశములో శుభాశుభములు సంభవించునని పెద్దలు చెప్పుచున్నారు.

సంక్రాంతి పుష్యమాసములో వచ్చును. సంక్రాంతి పండుగను గొబ్బెమ్మ పండుగని యందురు. "గొబ్బెమ్మ" అనఁగా గోపునకు తల్లి. "గోపు" అనఁగా గోపాల బాల కృష్ణుఁడు. అందుచేతనే "తల్లిగొబ్బి" "పిల్లగొబ్బి" అని రెండు రకములు చేయుదురు. ధనుర్మాసము నెలరోజులును, ఎంత

చలిగానున్నను; తెల్లవారుగట్ల, భూపాలరాగము వినేసరికి, ప్రక్కమీాద పడుకోబుద్ధి యుండదు, దేవాలయములలో, బాలభోగములు; బాజాలు; వినేసరికి, స్త్రీలు లేచి వాకిళ్ళు తుడిచి కళ్ళాపువేసి, చిత్రవిచిత్రములైన ముగ్గులుపెట్టుదురు.

## గొబ్బెమ్మ

ఆ ముగ్గులమీాద, గోమయముతో, బేసిసంఖ్యగా, గొబ్బిళ్ళు పెట్టుదురు. అనఁగా (1) మూడు గొబ్బిళ్ళు దీనిని పిల్లగొబ్బి యందురు. (2) అయిదు గొబ్బిళ్ళు దీనిని తల్లిగొబ్బి యందురు. (3) కొందరు రోజురోజునకు రెట్టింపు చేయుచు గొబ్బిళ్ళు పెట్టుదురు. ఈ గొబ్బిళ్ళలో ఉదయము పెట్టువానిని "తొలిగొబ్బి" అనియు, సాయంత్రము పెట్టువానిని "సంది గొబ్బి" అనియు చెప్పుదురు. పూజ పూర్తిఅయినపిదప, ఆ గొబ్బిళ్ళు తీసి; భోగిపిడకలుచేసి; గోడకు చరుతురు. ఈ పిడుకలను భోగినాడు, భోగిమంటలో వాడుదురు. గొబ్బెమ్మలకు పసుపు, కుంకుమ, పువ్వులు, పిండి మొదలగువానితో, అలంకరించి, అటుకులు, సెనగపప్పు బెల్లము, కొబ్బరికాయ, అరటిపళ్లు నైవేద్యముగా బెట్టి రజస్వలలుకాని బాలికలు చప్పట్లుకొట్టుచు, గొబ్బిపాటలు పాడుతూ పూజించెదరు. "సందిగొబ్బి" కి పేరంటాళ్ళను పిలిపించి, పాటలు; పద్యములు; వేడుకలు; చేసి పళ్ళు తాంబూలములు పంచిపెట్టుదురు.

# 1 గొబ్బెమ్మ పదాలు

"సందె గొబ్బెమ్మా! శుభములివ్వాలే;
తామరపువ్వంటి । తమ్ముణ్ణివ్వాలే;
చేమంతి పువ్వంటి । చెల్లెల్నివ్వాలే;
మొగలిపువ్వంటి । మొగుడు నివ్వాలి"

అని పాడి నమస్కారములు చేయుదురు.

2 "గొబ్బియ్యాలో; గొబ్బియలో;
గొబ్బి; గొబ్బి; వేయరమ్మా!
గొబ్బాని లాలయో.
గొబ్బియ్యాలో.
గొబ్బియ్యాలో; గొబ్బి; గొబ్బి; వేయరమ్మా
కొండంత గుమ్మడే; గొబ్బియ్యాలో ॥గొ॥
గొబ్బియ్యాలో; గుమ్మడంటే; గుమ్మడుగాదు;
కోరమీసం నాయడే; గొబ్బియ్యాలో ॥గొ॥

ధనుర్మాసము మొదలు సంక్రాంతి వరకు రైతులు, ఎండ వానల కోర్చి; పండించిన పంటలను, యింటికి జేర్తురు. తమ కష్టార్జితమైన పంట యింటికి జేరునప్పుడుండు, ఆనందమునకు మేరయుండునా? "ఆనందోబ్రహ్మ" అని; ఆనందపారవశ్య మున, ఆవతరించునదే "కళ" కనుకనే ధనుర్మాసము నెల రోజులు "కాళారాధన" "కళాపోషణ" ఎక్కువగా నుండును. "దేహి" అన్నవారికి "లేదు" అన్నమాట లేకుండ దాన

ధర్మము లోనర్చుటయేకాక; ప్రతిజీవిని సంతృప్తి పఱచవలె ననెడి తలంపునకు, వీధియరుగులమీద వ్రేలాడగట్టు వరి కంకుల కుచ్చులే పరమ నిదర్శనము.

## ధనుర్మాసము ముగ్గులు

సంక్రాంతి నెలపెట్టినది లగాయితు, ఆఖరువరకు ఆడ వారు తమతమ ప్రాంగణములో; జాతీయ చిత్రకళకు ప్రథమ సోపానమగు "ముగ్గులు" అలంకరించెదరు. వీటిని "సంక్రాంతి ముగ్గులు" అని పిలుతురు.

ఈ ధనుర్మాసములో, ప్రజలు ఉత్సాహవంతులై, పుష్పములవలె వికసించిన హృదయములలో నుందురు, అందుచే వికసించిన పుష్పమును; దాని సౌరభముచే ఆకర్షింపఁ బడిన, కృష్ణసర్పమును వీధులందు ముగ్గులలో చిత్రింతురు. "పుష్పగుచ్ఛబంధము" వంటి ముగ్గులేగాక, "కుండలినాగ బంధము" వంటిముగ్గులనుకూడ వీధులం దలంకరింతురు.

నాగబంధ మప్పటి హేమంత ఋతువు; అప్పటి మంచునకు; చలికి, "ప్రజలు పాముమెలికలు తిరిగినట్లు, పెనవేసుకొని పోదురు" అని స్ఫురింప జేయును. ఈ ముగ్గులవద్ద బాలికలు కుమ్మి; కోలాటము, పాటలు పాడుదురు.

## కోలాటము పాట

ఈపాట సంవాదముగా పాడుదురు.

గొల్లభామ:- గొల్లవారి వాడలకు, కృష్ణమూర్తీ!
నీవు; యేమిపనులకు; వచ్చినావు కృష్ణమూర్తీ

కృష్ణమూర్తి:-పాలుకొన వచ్చినానే; గొల్లభామా!
మంచి పాలుపోసి । నన్ను బంపు గొల్ల భామ॥
గొల్లభామ:- కొత్తకోడలనయ్యా! కృష్ణమూర్తీ!
మా, అత్తగారి నడుగవయ్యా॥ కృష్ణమూర్తీ?
కృష్ణమూర్తి:-క్రొత్తకోడలైతేనేమె? గొల్లభామా!
నా రొక్కమిచ్చి పుచ్చుకొంటే;గొల్లభామా!
గొల్లభామ:- నీరొక్కము నాకొద్దయ్యా; కృష్ణమూర్తీ!
నీవు రొంపుసేయక పోవయ్యా; కృష్ణమూర్తీ!

ఇట్టి పాటలలో సర్వసాధారణముగా శ్రీకృష్ణలీలలే యుండును.

## కుమ్మిపదము

బాలికలు; చప్పట్లుకొట్టుచు, అభినయము చేయుచు; కుమ్మిపదములు పాడుదురు.

పల్లవి:- జయ; జయ; పరమాత్మ
సకలభువనకారణా! । సకలభువనకారణా!
జయ; జయ; పరమాత్మ.
సకలభువన కారణా! సకలభువకారణా! ॥జ॥

౧ చ:-నిలయమైన । నిగమములను
నిలయమైన । నిగమములను।
నలువకిడిన । మీనరూప !
మీ న రూ పా! ॥జ॥

౨ చ:-అమరులకై ; మందరాద్రి,
అసురులకై ; మందరాద్రి,
నధివహించిన; కూర్మరూప!
కూర్మ రూపా! ॥జ॥

3 చ:- బలినడచిన. (శ్రీ) వామనరూప!
పరశురామ; క్షత్రియకులభీమ;
దశరథరామ; దైవలలామ;
నందయశోదల నందన; ముకుంద;
బృందావనలోల! కరుణవిలోల? ॥జ॥

౪ చ:- జీవహింస మానుప భువి;
జీవహింస మానుప భువి;
జన్మించిన, సౌమ్యమూర్తి;
బుద్ధరూప; బుద్ధరూపా ॥జ॥

౫ చ:-కలియుగమున । కలుషమడుప
కలియుగమున । కలుషమడుప
కలికివైన । పద్మనాభ.
పద్మనాభా! ॥జ॥

ఇటువంటి పాటలు, తాళ; నృత్య; అభినయ; రాగా దులతో శ్రావ్యముగా, వినువారికి; కనువారికి; ఆహ్లాదకర ముగా పాడుదురు.

## కాలపరిస్థితి

ధనుర్మాసాంతమునకు, దక్షిణాయనము పూర్తియయి ఉత్తరాయణము ప్రవేశించును. దిక్కులలో దక్షిణదిక్కునకు యము డధిపతి. ఈతడు మరణకారకుడు. దక్షిణాయనము రోగవ్యాప్తికి దోహదమిచ్చు. వాతావరణము గలది. "వర్ష; శరత్; హేమంత" ఋతువులతో గూడి, భూమి నీటితోను; తేమతోను; నిండియుండును.

వాయువు శీతలముగానుండి; తక్కువ యుష్ణముగల సూర్యరస్మితో వుండును. యీవాతావరణము "సాంక్రామిక వ్యాధులు" ఉద్భవించుట కెక్కువ దోహదకారిగా నుండును. యీ సమయమునే "యమదంష్ట్రికాలము" అని చెప్పుదురు. ఇందే "కోరలమ్మపున్నమ" అనగా మార్గశిరపూర్ణిమ వచ్చును. "కోరలమ్మ పున్నానికి; కోటితలకాయలు కావాలి" అను సామెత కలదు. ఇది దాటినచో; మరణము నతిక్రమించి నట్లే యని ప్రజలు సంతసింతురు.

ఈ క్రిములను సంహారించు తలంపుతోనే; నట్టిళ్ళ అలుకుట; ముగ్గులు వేయుట, వాకిళ్ళ కళ్ళాపు వేసి ముగ్గులు పెట్టుటయు, జరిగించుచున్నారు.

## కళ్ళాపు-ముగ్గులు-వాని పరమార్థములు

కళ్ళాపుపై ముగ్గులువేయు; ముగుదలకు ముగ్గులపం డుగ. ముగ్గులపై గొబ్బిళ్ళుపెట్టే బాలికలకు, గొబ్బిపండుగ.

గృహాలంకరణ నిమిత్తము, గోమయము; గుల్లముగ్గు; పసుపును సున్నమును కలుపగా వచ్చిన "పారాణి" లేక కుంకుమను వాడుదురు. ఆవుపేడ ఆరోగ్యమును కాపాడెడి వస్తువులలో ముఖ్యమైనది. "క్రిమిసంహారి" వాయుదోషములను మశూచికాది వ్యాధులను; రానీయదు. దోషములబాధను నివారించును. గోవువలన లభించు ప్రతివస్తువును; ఆరోగ్యకరమును; మంగళప్రదమునై యుండును.

"గోమూత్రం, గోమయం సర్పిః।
క్షీరం దధిచ రోచనా.।
షడంగమే తత్పరమ్।
మాంగల్యా సర్వదా గవాం॥"

అనఁగా:- గోమూత్రము; గోమయము; గోఘృతము; గోక్షీరము; గోదధి, గోరోజనములు, మంగళప్రదములని పంచగవ్య విధానంబునందు గలదు.

అప్పుడు వేసిన గోమయము, "కస్తూరి" తో సమానమని, ఆయుర్వేదమునందు కలదు.

పసుపునకు గుణప్రధానముగా "క్రిమిఘ్ని" అని పేరున్నది. రంగు ముగ్గుకూడ "క్రిమిహారి" ఉష్ణమును కలుగజేయును.

గోమయముతో; అలికి; లేక చర్చితమొనర్చి; పసుపు సున్నము ముగ్గులు పెట్టగనే నీలపుటాకాశమున; తెల్లని నక్షత్రము లలంకరించినట్లు నయనానందమును కలిగించును,

అందువలన "అలికిన యింట్లో; ఒలికినా అందమే" అనే సామెత యేర్పడినది,

ఈరంగ వల్లులు, ఉత్తరాయణమునకు; మకర సంక్రమణమునందు, ఆహ్వానమిచ్చునవిగా నున్నవి. ఆరోగ్యప్రదమగు మకర సంక్రమణము; ప్రవేశించగనే, అనారోగ్య ప్రకృతిని రథమెక్కించి, సాగనంపుచున్నట్లు; భోగి; పెద్ద పండుగ; కనుమ పండుగలు గడచిన పిమ్మట, ముగ్గులతో రథమును బయటకు లాగివేయుచున్నారు.

పై విషయములు సమన్వయించి; చూచినచో; ఆరోగ్య సూత్రములేగాక; ఆధ్యాత్మిక భావములును, యిమిడి యున్నవి. తెలుపు; పసుపు; రంగులు సాత్విక గుణములు కలవి. ఎరుపు రజోగుణము కలది. నలుపు తామస గుణము కలది. సత్వరజస్తమో గుణాత్మకమగు, ప్రకృతిని సేవించి; నలుపు+ఎరుపు+తెలుపు=నీలిరంగు శరీరడగు, పరమాత్మని చేరవలెననెడి, పరమార్థ మేర్పడుచున్నది.

## సంకురమయ్య

కర్కాటమునకు; వరుణుడును. మకరమునకు; మిత్రుడును, సంక్రమణాధిపతులు. ఈ యిద్దరికిని, మకరముపై యధికారమున్నది. యీ యుమ్మడి మూర్తియే, సంక్రాంతి పురుషుడు; కాలపురుషుడు; యుగపురుషుడు; సంవత్సరాధిపతి

యైన "సంకురుమయ్య" పెద్దపండుగ రోజున నైవేద్యముపెట్టి భక్తితో నమస్కరించుచు.

## పూజా పదము

"ఎలుక ముట్టాలేదు! చిలుక ముట్టాలేదు.
నీకే పెట్టితినయ్యా! కాలక్షేరవుండా!"

అని ప్రార్థించెదరు.

సంక్రాంతినిగూర్చి సంభ్రమముతో బాలికలు పాడునది.

"సంకురాత్రి పండుగదిగదిగో!
సంతురాత్రి ముగ్గు లివిగివిగో!
చలి యింక పోతుంది.
చంకలెత్తి ఆడండి"

## మకర సంక్రాంతి మహత్తు

సూర్యుఁడు మకరరాశిలో ప్రవేశించి, ఉత్తరముగా పోవుటయే, "ఉత్తరాయణ పుణ్యకాలము" "మకర సంక్రాంతి" అని యందురు. మకర సంక్రాంతి, వ్రతముగాని; పూజగాని; కాదు. వ్రతమనఁగా:- దీక్ష; మనోసంకల్పము; దృఢనిశ్చయమును బూనుట. అనఁగా:- సత్యానారాయణ వ్రతము వంటివి. పూజయనఁగా:- ఒక వ్యక్తియొక్క గొప్పతనమును; అభినందించుచు; ఆవ్యక్తి గౌరవముతో; భక్తితో స్మరించుట. అనఁగా:- తద్దివంటివి.

సంక్రాంతి పర్వ తిథులలో చేరును. పర్వతిథులనఁగా పవిత్రములైన దినములు. ఉదాహరణము:- మహాశివరాత్రి, వైకుంఠ యేకాదశి. శరన్నవరాత్రులు, ఈ పర్వదినములందు పితృదేవతల నారాధించి తరింతురు.

## మూడు పండుగలయొక్క ప్రాముఖ్యము

జ్యోతిష, ఆరోగ్య, ఆధాత్మిక, శాస్త్రములకు, సంబంధించిన యీ సంక్రాంతిలో 1. భోగి 2. పెదపండుగ 2. కనుమ పండుగలు. మూడు పండుగలు వెళ్ళిన మరునాడు "ముక్కనుమ" అనికూడా వాడుదురు. యీ మూడు పండుగలును, మహా సుదినములుగా దేశములో; ఒక్కొక్క ప్రాంతమున ఒక్కొక్క ఆచారముతో చేయుదురు.

1. తొలినాడు భోగి పండుగ. ఈ రోజున, "ఇంద్రి పోంగలిని" పాలు; అన్నముతో తయారు చేయుదురు. ఇది యింద్రుని ఆహ్వానించుటను సూచించును.అనఁగా:-"రాబోవు వేసవియొక్క తీక్ష్ణతను, తగ్గించి, త్వరలో తొలకరిని ప్రసాదించుము" అనెడి ప్రార్థనా సూచకము.

2. మలినాడు పెద్ద పండుగ; ఈ దినము "సూర్య పోంగలిని" తయారుచేయుదురు. ఇది సూర్యుని, ఆహ్వానించుటను సూచించును. అనఁగా "దక్షిణాయనమునుండి; ఉత్తరాయణమునకు మారిన, ఓ లోకబాంధవా ? లోకులను; ఆరోగ్యవంతముగా కాపాడుము" అనెడి ప్రార్థనాసూచకము.

2. మూడవనాడు కనుమ పండుగ. ఈ రోజున "మాట్టుపొంగలిని" తయారుచేయుదురు. గోపూజ గావించి; ఒకటి గోవునకుబెట్టి, ఒకటి గోవుమెడలో గట్టుదురు "ఓ గోమాతా ? కూరగాయలు దొరకని మండువేసవిలో, నీవు పాలిచ్చి మమ్ము కాపాడుము" అనెడి ప్రార్థనా సూచకము.

## పండుగలలో చేయు దానములు

ఈ సంక్రాంతికి పండుగలలో, నువ్వులు; నెయ్యి; గొంగళ్ళు;-బీదలకు దానము చేయుదురు. ఎందుచేతననగా:- ఇవి యుష్ణమును కల్గించును, దానములు పుచ్చుకొన్నవారలు చలిబాధనుండి తప్పించుకొని; ఉష్ణమువలన నుత్సాహము కలిగియుందురు. కొందరు "చిమ్మిలి" ఉండలు దానము చేయుదురు. మరికొందరు నువ్వుల నీళ్ళతో దేవతలను, ఆహ్వానింతురు. పుణ్యస్త్రీలు కొందరు, కుండలతో, పసుపు; కుంకుమ; నువ్వులనీళ్ళు; నెయ్యి; (గంటి) (ధాన్యము) గోధు మలు) పోసి ముత్తయిదువులకు దానముచేయురురు. కొందరు నూనె; పిండి; ఉప్పు; చీర; మొదలగు వానిని పంచిపెట్టుదురు మరికొందరు సముద్ర తీరమునను; నదీతీరమునను, గల పుణ్య క్షేత్రములలో; నువ్వులనే; ప్రధానముగా తర్పణములు విడిచెదరు.

అన్ని ప్రాంతములందును నువ్వులనే ప్రధానముగా; ఉపయోగించుటలో; విశేషమేమి ? నువ్వులు శరీరములోని

కొావ్వును తగ్గించి, ఆరోగ్యము నిచ్చును. సూర్యునకును; యమునకును; నువ్వులనిన యిష్టము. సూర్యుడు; మనకు ప్రత్యక్ష దైవము. భగవంతుని ప్రతినిధి. కర్మసాక్షి యముని దర్బారులో మనము చేసిన కర్మలకు సాక్ష్యమిచ్చును. సూర్యుని శక్తి వల్లనే "చేతనా చేతనములు" అన్నియు జీవించుచున్నవి. అట్టి ప్రత్యక్ష దైవమును పూజించుట; సుఖమునకును; సంతోషమునకును; ఆరోగ్యమునకును; ఆధారముకదా!

ఈ దినములలో; మానవ చర్యలను; గమనించుటకై; యముడు చూచుచుండును. అందువలన దానధర్మములు; పరోపకారములు. విరివిగా చేయుచున్నారు.

"సంక్రాంతికి సంకెళ్ళలో; ఉన్నవారికికూడ విముక్తి ఉంది" అను సామెత గలదు.

## పండుగ ముచ్చట్లు

ఈ పర్వదినములలో, పుట్టింటి ఆడుబిడ్డలను; అల్లుళ్ళను తీసుకవచ్చుట, బొమ్మల కొలువులుపెట్టుట, గోడలకు వెల్లలు వేసి; ఓరుపులు తీయుట, గోడలమీద చిత్రములు వేయుట, యీ అలంకరణములవలన లక్ష్మి తాండవించునట్లు గ్రామము విరాజిల్లుచుండును.

జియ్యర్లులు, దాసర్లు, జంగవదేవర్లు, గంగిరెడ్లవారు, అడవిచెంచులు, అప్పన్న ఆబోతుల సంభ్రమములవారు బుడ

బుక్కలవారు మొదలయిన యాచకాళి రాకపోకలవలన వాడ వాడలు వేడుకలతో విరాజిల్లుచుండును.

పేరంటాండ్ర హడావిడలు, బాలబాలిక; ఆటపాటలు, పిల్లన గ్రోవుల నాదములు, బాజాభజంత్రీలు గ్రామ మేమూ లచూచిన, ముద్దుమురిపములతో కన్నుల పండువుగానుండును ఒకవైపున కోడి పందెములు, మరొకచోట పొట్టేళ్ళ పందెములు, గ్రామ కంఠములందు జరుగుచుండును. నడివీధులలోను దేవాలయముల యందును; తందాన తాన పదములును; అవతార ఆకపదములు; భజనలు; కోలాటములు. మనోరంజకముగా నుండుటచే జనము గుమిగూడి ఆనందించుచుందురు.

ముత్తయిదువులేమి; పూర్వసువాసులేమి; చీకటితో స్నానముచేసి; ఎవరికి వారే పూజలు చేసుకొందురు. అందరు సంబరములతోను; సరదాలతోను; కాలక్షేపము చేయుదురు.

1. భోగి:- కు గ్రామమంతటికిని; ఒకే భోగి మంటయును; పెద్ద గ్రామమయినచో; వాడ వాడలకొక భోగిమంటయును; వేయుదురు. వారసత్వపు వారసుడు; తలంటి స్నానము చేసి; తడిబట్టలతో; భోగిమంట ప్రారంభించగా మిగిలిన వారంద రటుతరువాత మంట వేయుదురు. నెల పొడుగునను సిద్ధపరచిన భోగి పిడకలు యీ మంటలో వేసి; చిన్న పిల్లలెంతో; ఆనందింతురు.

**2.** పెద్దపండుగనాడు, విభక్తకుటుంబముువారు. ఉమ్మడిగా వండుకొని; ఏకపంక్తిని భుజింతురు. :ఆవంటకములను

తయారుచేయు స్త్రీ, మారుమనుమునై యుండరాదు. ఈ రోజున పెద్దలకు (పితృదేవతలకు) పిండివంటలు; పప్పుదప్పళములు; పాయసాన్నము, అన్నము; నైవేద్యము పెట్టుదురు. నైవేద్యమువద్ద ధూపదీపములు సమర్పించి, కాలభైరవుని పాట పాడుదురు,

రాత్రి భజనలుచేయుచు; ప్రతిపూజవద్దకు వెళ్ళి; ఫలహారములు పుచ్చుకొందురు.

3. కనుముపండుగనాడు, దేశసౌభాగ్యమును; శాంతిని; కలిగించే పదునెనిమిది జాతులవారును, తమ వృత్తి పనిముట్లు శుభ్రపరచి, పసుపు; కుంకుమ, గంధములురాచి, పూవులు, పత్రితో పూజించి, ధూపదీపము లిత్తురు. అమ్మవారికి నైవేద్యములను చెల్లింతురు.

## నైవేద్య ముపాట

"అరటిపళ్లు, కొబ్బరికాయలు,
అమ్మవారికీ;
హారతి పళ్లెం-కానుకలు,
పూజారికీ
చెంగల్వ పూదండ, సీతామహాలక్ష్మికి
చేతిలో-కాసులు-సన్యాసికి.
భక్తితో మొక్కాలి మాఅమ్మకూ?
చేతులు జోడిలు । చిత్తంబు నిలిపి॥

ఇటువంటి నైవేద్యపదములు పాడుదురు.

4. పై మూడుపండగలే ప్రధానము. అవిగాక, మూడు పండుగలు వెళ్ళిన మరునాడు "ముక్కనుమ" అందురు.

కనుమ, ముక్కనుమ, పండుగలలో కోడిపందెములు, గొర్రెపోతుల పందెములు ఆడుచుందురు. పరిసరములందుండెడి అమ్మవార్లకును, పోతురాజులకును, మొక్కుబడులు చెల్లింతురు. ఈ యాత్రను "తీర్థము" అందురు.

పెద్దపండుగ, కనుము; ముక్కనుము పండుగలలో, "తోటపెద్దనూ" (ఆబోతును) భక్తులు, ఊరేగింపుచు; అవతారమును పాడుదురు. యీ అవతారగాథలనే పెద్దలు, రాత్రులందు "ఆకపదము" అను పేరుతో పాడింతురు.

పాటకులు అనేకమాదిరీ మకుటములతో పాడుచున్నారు.

(1) "శ్రీరామ; రామ; రా । మోరామ; రామయ్యా!
హరిరామ; రామ; రా । మయోధ్య రామా"॥

(2) శ్రీరామ; రఘురామ; । సీతాపతేరామ;
శత్రుభీకర రామ । సంగ్రామ భీమా!"

(3) "హరిహరీ నారాయ । ణాదినారాయణా!
కరుణించి మమ్మేలు । కమలలోచనుడా!

(4) "శ్రీరామ; గుణధామ । శ్రితజనావనరామ;
జలధిబంధించిన । జానకీ రామా!"

(5) "ఆ.........ఆ.........!"

ఈ మకుటములతో రామాయణము, భారత, భాగవతాది గ్రంథస్థగాథలను పాడుచుందురు.

ఆబోతును, గ్రామమంతయును, ఊరేగించుచూ; ఫలహారము లందుకొని, నెమిలిపురి కుంచెతో దీవింతురు.

## దీవనపదము

"హరో! హరి; వెండితుట్టలు కొన్ని
రాగితుట్టలు కొన్ని; రావణుని మేడలకు
రాళ్ళు మోయించి!
పసిబిడ్డ తల్లులు । బాలెంత రాళ్ళు
అన్యాకరి రావణుని । వెట్టిచెయ్యలేక
మూడేసిసోలలు । ముక్కజొన్నలు
పై పత్యమీయంగ.
దిగేరు దేవతలు । దిమ్మిసీలాగ
పడ్డారు దేవతలు । పర్వతంలాగ
హరో? హరి.
దేశానికొక్కొక్క । దేవుడుంటాడు
అరటాకు వందనము । చెరుకాకు చేబొండ
పాలకరి మఱ్ఱాకు । పానుపేసారు.
జయమంగళం । జయా! శుభమంగళం.

## భజనలు

"రామభజన" అని దీనిపేరు. ఇందులో (1) తాళం

భజన (2) చిడతలభజన (3) హరిభజన (4) కోపులు (5) పం డరీభజన (6) తప్పిడికుండల భజన" అని వివిధరకములుగా నున్నవి.

ఏభజనకైనను; "దీపపుసమ్మె" కాని; పొన్నచెట్టు" కాని ఉపయోగింతురు.

## 1 తాళం భజనకీర్తనలు

పల్లవి:-పొన్నవాహాన మేగంటి మమ్మా!
గోపాలుడు దాగిన ।పొన్న॥

అనుపల్లవి:-ఎన్నగ యాదవ । కన్నెల చీరెలు।
తిన్నగ యెత్తుక । వెన్నుడు దాగిన ।పొ॥

1 చ:_అనలు, కొమ్మలు వున్నవమ్మా!
ఆమాని పూత । లమరి కాయలు కాచునమ్మా!
కనుగొంటిమి (శ్రీ) । కరమున పిందెలు
నను బొందెను. (శ్రీ) । నను భాగ్యములు ।।పొ॥

2 చ:- చుట్టు గోపికల । మూకలమ్మా!
గోపిక లందరు । చెట్టుచుట్టు దిరుగుదురమ్మా!
పట్టికొమ్మకు । పాకుద మనుచును
చెట్టపట్టీలతో । అట్టట్టె చొరబడు ॥పొ॥

3 చ:-శృంగార మైన వృక్షమమ్మా!
చూచేటివారికి మంగళప్రదమైయుండునమ్మా!
శుక పికములచే । కిలకిలరవములు
చిలకల రవములు । కిలకిల గూయగ ॥పొ॥

4 చ:-నిండుభక్తితో నిలచిరమ్మా!
ఆ గోపికలందరూ
రెండు హస్తము లె త్తిరమ్మా
దండము వెంకట దాసపోషక।
దండంబిదిగో యనుచున్నారమ్మా ॥పో॥
"శ్రీ భద్రాచలరామ; గోవిందో! హరి"
"శ్రీ రమారమణ గోవిందో! హరి"
"శ్రీరామ గోవిందో! హరి"
"హరిలో రంగా! హరి"

ప్రతీ భజనపాటకును, ఆద్యంతములందీ మకుటములను పాడుచుందురు.

## చిడతల భజన

౧ ప॥ శివుడు తాండవము సేయుచుండు । కైలాసమందు ॥శి॥

అ। ప॥ శివుడు తాండము సేయుచు నిత్యము.
అవిరళముగ జగదాంబ ముందరను॥ శి॥

1 చ:- భారతి వీణా శ్రుతి వాయింప
లయ దప్పక బ్రహ్మ తాళంబు గొలుప॥
సారస వృత్తి సప్త తాళముల
సారము దప్పక ప్రదోష వేళలను॥
నారాయణమూర్తి। మద్దెల వాయింపా। ॥శి॥

2 చ:- మురళి దేవేంద్రుడు పూరింప
తద్ధి మిధియని తెయి తె యనుచును,
భరత శాస్త్రముల పద్ధతి తెలియ.
శరణార్థుండగు। చామర్తి
నరసింహ మానస। నాట్యశాలలో ॥శి॥

-౨ పల్లవి:- జంగమయ్యా । జంగమయ్యా।
మాయదారి । జంగమయ్యా.

అ:- మాయజేసి । నన్ను । దెస్తివా!

1 చ:- రాతిక్రింద చలమేతీసి, మా జంగమయ్యా.
రాగిచెంబు చేతబట్టి.
రాని పోని రవ్వలొచ్చేగదా।
మా జంగమయ్యా।

2 చ:- మీకు నేను నేస్తుదాన్ని!
మీ వారికి పగదాన్ని.
యింటి పొరుగున రవ్వలొచ్చేగదా!
మా జంగమయ్యా.

3 చ:- ఈతకమ్మ యిల్లే కట్టి
తాటికమ్మ। దడులేకట్టి.
పూరిగుడెసె, కా। పురముంటెగదా.
మా జంగమయ్యా.

4 చ:- మల్లె మొలచి। జిల్లేడాయె
మనసు రెండు। విధములాయె.

పొత్తియాకులు । మెత్తనాయెగదా!

మా జంగమయ్యా!

5 చ:- గుట్టలూ । పుట్టలూ దాటి

కోరింత వనములు దాటి

అన్ని దాటి । అడవి పడితిమిగదా!

మా జంగమయ్యా!

6 చ:- కొండ కొండకు । వెదురు నరికి

కోన లోపల । గుడిసె వేసి.

యిరుగు లేదు । పొరుగు లేరుగదా!

మా జంగమయ్యా!

## 3 హరిభజన

## హనుమ ద్రామ సంవాదము

హను:- ఎవరయ్యా మీరు? యీ వనమున కేలవచ్చారు?

మిమ్ములను పరికించిచూడగ రాచబిడ్డపోల్కి-

లేడ గానము — వేషముదాల్చి । కఠిన భూముల కేల

వస్తిరి? ॥ఎ॥

రామ:- కపివర్య వినుమా! మా జన్మము । ల యోధ్య

గనుమా!

తల్లి కైక వరముచేతను । తరలివస్తిమి కాన

భూమికి.

దశరథ పుత్రులము; గాన; రామలక్ష్మణులము॥క॥

హాను:- ఇందుండుటేమి ? మీ మోములు ,కందుండుటేమి?
మా కుపతి సుగ్రీవుడుండు । మంచివాడు రండు
పోదము !
చాల ఫలములు, భుజయించి; చాల సౌఖ్యము
లొందెదారు ॥ఎ॥

రామ:- ఆహా ఏమందు; నీనిబుద్ధికి । ఆనందమయ్యెందిచాల!
సోదరా ! లక్షుణా ! వినుమా సొంపుగా యిక
పోయివత్తము.
ఆదరించి వారలేగద । ఆప్తులౌదురు , మనకు మిత్రులు॥

# 4 కోలాటము

(ఈ పాటలు సంవత్సరాది పండుగకు వేయబడినవి.)

# 5 పండరీ భజన (వేదాంత భజన)

పల్లవి:-చిగురో యమ్మ చింత । చిగురోయమ్మ !
అ। ప॥ చింత చిగురు కొనరే । యమ్మా।
చింత చిగురు కొనరే యమ్మలారా ! ॥చి॥

1 చ:- చెలియరో చిక్కుళ్ళ గలచింత
ఓంకార మందున్న దీచింత.
ముగ్గురు మూర్తులకు । మూలమైనది చింత
వగరు విరిగిన చింతా । వన్నెలరగ చింత ॥చి॥

2 చ:- ఏరులు మూడును । యేకమైనది చింత
యేరులు నడుమను । మెలనాగ గల చింత

పడమటి వీధిలో । బాగైయున్నది చింత
మేరువపై నను । మెరయుచున్నది చింత ॥చి॥

3 చ:- కుండలీ రంధ్రములు । కుదురైన దీచింత
కొండ మీదమృతము । కురియుచున్నది చింత
నిండు కళల రాశి । నిలచియున్నది చింత
పండు వెన్నెల బైట । భద్రమైనది చింత ॥చి॥

4 చ:- కంటి దృష్టిచేత । కమలమైనది చింత
మింటనే మెరుపులు । మెరయుచున్నది చింత
వెంటనే చంద్రుని । వెన్నెల గల చింత
అంటి మ్రింగుచును । హంసైయున్నది చింత ॥చి॥

5 చ:- నాదు బిందు కళల । నంటియున్నది చింత
భేద వాదములేక । పెరిగియున్నది చింత
వేద రహస్యము । వెన్నెలగల చింత
సాధించి కుండలీ । శోధించినా చింత ॥చి॥

6 చ:- కోటలోనే మూడు । కొత్తళంబుల చింత
కోటలోనే యొక్క । కూతవేసిన చింత
కూటస్థలంబులు । కోమలముగ చింత
పేట గోవిందుని । పేరైయున్నది చింత ॥చి॥

## 6 తప్పెడి కుండల భజన

ప॥ గమ్మా! గుమన్నలార । గుమ్మన్నలారో !
నా రాస గుమ్మడీ । రారావమ్మ॥

1. తూరూపు నున్నాది । తారూపుగుళ్లో। నా॥
2. తారూపు గుళ్లకు । తవ్వంత కొప్పో। నా॥
3. తవ్వంత కొప్పులో ॥ గుప్పెడేసిపోలో। నా॥
4. గుప్పెడేసి పువ్వులకు । తాకట్టు సరుకో। నా॥
5. తాకట్టు సరుకూకీ । తాగుమోతు మొగుడో। నా।
6. తాగుమోతు మొగుడికి । తాళింపుకూడో। నా॥
7. తాళింపుకూడుకీ । తాటికాయ పులుపో॥

2 పల్లవి:-అల్లబోయిన దాన!
గొల్లపెద్దమ్మా! గొల్లపెద్దమ్మా॥

1. నీ యేడుగు కోడళ్ళు । నీలకెళ్ళారే?
నీలకెళ్ళారే?
2. కళ్ళు త్రిప్పినారు । కడవలెత్తారే?
కడవలెత్తారే?
3. గుడ్లు త్రిప్పినారు ॥ గూనలెత్తారే?
గూనలెత్తారే!

## హెచ్చరిక

(భజనలు ముగించేముందు యీ హెచ్చరికలు పాడుదురు.)

తకిట; ఝుణుత; ధిమిత; తకుంధరిత!
మదమ గాత్రుండయిన సోమకు నదిమి పట్టితివా?
నాల్గు వేదములు, ధాతకిచ్చితివి ' నమ్మితిరారా!
వేగ; స్థిరముగా మగటూరి । పురమున వెలసిన।

ఉరగ శయన, వచ్చి బ్రోవగదరా!
తకిట్ట; ఝణుత; ధిమిత; ధిమిత;
తకిట్ట; ఝణుత; దధిగిన తక;
ధిమి కిటతన, దధిగిణ, ధరను కొంత,
వంశోద్భవుడగు - నగధీశుని కృపచే!
ఏలుమురా! మత్స్యావతారా! చల్ మత్స్యావతారా

## మంగళ హారతి

ప॥ మంగళ; మని, మంగళ; మని. మంగళమునరే?
మంగళ, మని పాడరే। శృంగార రాముకు మం॥

1. ముత్యాల హారతులు। ముగువలు మీారివరమ్మా!
ముద్దుల శ్రీరామునకి॥ శోభనమే! శోభనమే.

2. పగడాల హారతులు। పడతులు మీారివరమ్మా.
పడతిరో సీతమ్మతల్లికి। శోభనమే. శోభనమే.

## నిద్రపుచ్చుట

భజనలు పూర్తికాగానే, దేవునకు
నిద్రపుచ్చే పాటలు పాడుదురు.

పల్లవి:-నిదుర పోడమ్మా!
మా! రామయ్య! బెదరినాడేమో! ని॥

అ। ప॥ అయ్యో! నిదుర బుచ్చుటమంటె;
మగువరో నేనెంతో!

నిదుర బుచ్చుటమంటె;
అదరి; బెదరి; చూచు ॥ని॥

1 చ:- రాతి సున్నపునీళ్ళు -
చేసి వసంతకము
తీసి; ఎఱ్ఱ నీరు । పారజల్లరమ్మా!

2 చ:- అయ్యో; లాలాక్షి; లోకాక్షి.
చేసి వసంతకము
తీసి; ఎఱ్ఱ నీరు । పారజల్లరమ్మా!

3 చ:- ఏ తిది కొంటకయి
భూతవైద్యుణ్ణి తెచ్చి
రాతి రచ్చరేకు । చేతగట్టరమ్మా ॥ని॥

ఈ విధముగా ముక్కనుమ వరకును, ఆబాల గోపాలము వేడుకలు, వినోదములు, భజనలతో, ఆనందమయముగా కాలమును వెళ్ళబుచ్చుదురు.

శ్రీ శ్రీ శ్రీ జేయును.

## పండుగలు .... పరమార్థములు

ప్రథమభాగము సమాప్తము.



# గమనిక

(1) గీతార్థసారము (పాట) 0—8—0
(స్త్రీలు పాడుకొనే "కస్తూరిరంగరంగా" అనేమాదిరి)
1 నుండి 6 వ అధ్యాయమునరకు ప్రథమభాగము

(2) గీతార్థసారము 2, 3 భాగములు వెలువడుచున్నవి.

(3) పండుగలు - పరమార్థములు ద్వితీయభాగము
(హిందూ, మహమ్మదీయ, క్రైస్తవ, బౌద్ధ, జైనాది వివిధ మతముల పండుగలుండును)

---


వలయువారు:—

నేదునూరి గంగాధరం
టౌను పోలీసులైన్ రామకృష్ణా స్కూలు
లక్ష్మీవారపేట — రాజమండ్రి.

---

లక్ష్మీప్రెస్ — రాజమండ్రి.